మహానాయకుడు। జపానువాళ్ళ సహాయంతో కమ్యూనిస్టులను వేటాడిన జంగ్ కై షేక్‌నుకూడా ఊరేగించారు। స్వాతంత్ర్యోద్యమాన్ని లాఠీలతో అణచిపెట్టాలని చూసిన బ్రిటిషువాళ్ళు భారతీయులకు దేశభక్తి ప్రబోధాలు చెయ్యటానికి ఉపక్రమించారు। ఏనాడో పంచతంత్రంలో చిత్రించిన నక్కలూ – రుద్రాక్ష పిల్లులూ పెద్దపెట్టున మళ్ళీ తయారయాయి।

నారాయణ ఈ అవకతవకలను గమనించాడేగాని, వీటినుంచి ఎటువంటి విషపరిణామాలు కలిగేదీ ఊహించలేకపోయాడు. జర్మనీ ఓటమితో కథ సుఖాంతమైనట్టు కనబడింది. ట్రూమన్ జపాను నగరాలమీద ఆటంబాంబులు వేయించినప్పుడు అతనిరక్తం ఉడికినమాట నిజమేగాని, అది అమెరికా సాగించబోయే నరభక్షణ కార్యక్రమానికి జేగంట అని అతను ఊహించలేదు. న్యూరెన్‌బర్గ్‌లో ఫాసిస్టు అవశేషాలకు సమాధి జరిగిందనుకున్నాడు గాని, ఫాసిజం అమెరికాకు వలస పోతున్నదని తెలుసుకోలేదు.

యుద్ధరంగంలో ఎందరో బలి అయినట్టే, యుద్ధరంగానికి దూరంగా ఎన్నో మానవ సంబంధాలు విచ్ఛిత్తి అయిపోయాయి. యుద్ధం నిలిచిందిగాని భావయుద్ధం నిలవలేదు. వెంకటేశ్వర్లు కమ్యూనిస్టు వ్యతిరేకిగా తయారయాడు. రామక్రిష్ణ "వీర కమ్యూనిస్టు"గా తయారయాడు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు కవ్వించుకోకుండా మాట్లాడలేని పరిస్థితి ఏర్పడింది.

నారాయణను ఆఫీసులో ముప్పాతికమంది "రష్యా ఏజంటు" కింద జమకట్టేశారు. కాని మరికొందరు అతనికి ఆప్తులయారు. భావసంబంధం చుట్టరికంకన్నా, మామూలు స్నేహంకన్నా దృఢమైనదన్న సంగతి నారాయణకు ఇంతకాలానికి తెలియవచ్చింది. గాంధీగారి ఉద్యమాలప్పుడు కూడా ఎలాటి సంబంధాలూ లేనివాళ్ళు "భాయి – భాయి" అయిపోయారు. కాని సోషలిస్టు – కమ్యూనిస్టు – మార్క్సిస్టు భావాలంత బలంగా గాంధీగారి ఉద్యమాలు మనుష్యులను అతకలేదేమోనని నారాయణకు అనిపించింది ...

లేదు. నారాయణ అనుకున్నట్టుగా కథ ముగియలేదు. జగన్నాటకంలో మరికొన్ని కంపుకొట్టే అధ్యాయాలూ, అంకాలూ ప్రారంభమవుతున్నాయి. బ్రిటిషువాళ్ళు పన్నిన ఉచ్చుల్లోకి కాంగ్రెసువాళ్ళు చేతులూ కాళ్ళూ దూర్చి, దేశవిభజనకు సమ్మతించి, అధికారపీఠాన్ని అలంకరించారు. వేటపోతులు తెగాయి. రక్తం యేర్లుకట్టి ప్రవహించింది. పాతిక సంవత్సరాలకు భారతీయుల తలసరి ఆదాయం రెండింతలు కావటానికి పథకాలు ఆలోచించిన మేధావులూ, వాళ్ళ ఏజెంట్లూ కోటలో

పాగా వేశారు. నారాయణ అనేక దుష్పరిణామాలు రానున్నట్టు అంచనా వేశాడు. ఆ దుష్పరిణామాలు అతను అనుకున్నంత దారుణంగానూ, అంత శీఘ్రంగానూ రాకపోవటం అతనికి కొంత మనశ్శాంతి నివ్వటానికిమాత్రమే తోడ్పడింది.

* * * * *

ఢిల్లీ కోటమీదనుంచి బ్రిటిషువాళ్ళ జెండా దిగిపోయి ఎంతోకాలం కాకుండానే నాటుఫాసిస్టులు గాంధీని హత్యచేశారు. హంతకుణ్ణి అభినందించినవాళ్ళలో నారాయణకు బాగా తెలిసినవాళ్ళున్నారు. గోడ్సేను శిక్షిస్తే గాంధీమహాత్ముడి ఆత్మ ఆక్రోశిస్తుందంటూ పత్రికకు వచ్చిన ఉత్తరాలు కొన్ని అచ్చయాయి. పత్రికలో అన్నిరకాల అభిప్రాయాలకూ చోటివ్వాలిగద! అటువంటి దేమీ లేదనీ, కొన్ని రకాల అభిప్రాయాలకు కొన్ని పత్రికలు సూదిమొన మోపినంతచోటుకూడా ఇవ్వవనీ నారాయణకు తెలుసు.

గాంధీ హత్య జరిగిన కొద్దిరోజులకే నారాయణ ఉద్యోగం మానేసి, ప్రెస్సొకటి కొన్నాడు. అదేమీ పెద్దప్రెస్సుకాదు. ఒక సిలండరుమిషనూ, ఒక ట్రెడిలూ ఉన్నాయి. అయిదారు కేసుల టైపూ, ఒక పాత కటింగుమిషనూ ఉన్నాయి. ప్రెస్సుమీద పెద్దలాభాలు వస్తాయని నారాయణ ఆశించలేదు. అతని ఉద్దేశం ఎప్పటికైనా ఒకమంచి వారపత్రిక పెట్టి, నడపాలని.

అయితే నారాయణ అనుకున్నట్టు జరగలేదు. వారపత్రిక పెట్టడం అనేక కారణాలవల్ల జరగలేదు. కాని ప్రెస్సుమీద డబ్బు బాగానే వచ్చింది. బుక్‌వర్క్ నారాయణ శక్తికిమించి వచ్చిపడింది. పనివాళ్ళు మంచివాళ్ళే. వాళ్ళకూ నారాయణకూ ఎన్నడూ పేచీవచ్చేదికాదు. వాళ్ళలో పార్థసారథి కొంత చైతన్యంగల పనివాడు. నారాయణతో ఎప్పుడన్నా రాజకీయాలు మాట్లాడేవాడు.

నారాయణ ప్రెస్సు కొన్న సమయంలోనే రామక్రిష్ణ ఎగ్మూరులో ఒక ఇల్లు అమ్మకాని కొనేస్తే కొన్నాడు. వాళ్ళు వేరే వెళ్ళిపోయారు.

ఒకప్పుడు నారాయణకు కాలవేగంలో హెచ్చుతగ్గులు తనజీవితంలోనే తెలియవచ్చేవి. ఇప్పుడవి బాహ్యజీవితంలో కనిపిస్తున్నాయి. అతని గృహజీవితం చాలా ప్రశాంతంగా ఉన్నది. బుల్లిపార్వతి తరవాత సావిత్రి తిరిగి గర్భవతి కాలేదు. పిల్ల కాన్వెంటుకు పోయి చదువుకుంటున్నది. నారాయణ మధ్యాహ్నం భోజనానికి వచ్చి తిరిగి మూడింటికి బయలుదేరి వెళ్ళిపోతాడు. ఒంటరిగా ఉన్నప్పుడు సావిత్రి ఏ పుస్తకమన్నా చదువుతుంది, లేకపోతే పత్రికలు తిరగేస్తుంది.




బుద్ధిపుడితే సినిమాకు పోతారు. దాదాపు ప్రతిఆదివారమూ రామక్రిష్ణా, సీతా వస్తారు. సీత అప్పుడే ఇద్దరుపిల్లల తల్లి. ఇద్దరూ మగపిల్లలే.

సాధారణంగా ఆదివారంనాడే నారాయణఇల్లు సందడిగా ఉంటుంది. ఆ రోజే అతన్ని చూడవచ్చేవాళ్ళు జాస్తిగా ఉంటారు. ఆరోజే సావిత్రికి పనికూడా జాస్తి- టిఫినులు చెయ్యటమూ, కాఫీలు కాయటమూసూ.

అడపా దడపా ఎవరో ఒకరికి జబ్బుచేస్తుంది. కాని వాటికి పార్వతి హయాంలో ఉండిన ప్రాముఖ్యం సావిత్రి హయాంలో లేదు. నూటికి తొంభై రోగాలు చూస్తూ ఊరుకున్నాకూడా వాటి కవే నయమవుతాయని నారాయణ ఎక్కడో చదివాడు. సావిత్రి ఆ సంగతి ఎరిగినట్టే ప్రవర్తిస్తుంది. ఆమెకు కొన్ని ప్రాథమిక సూత్రాలు తెలుసు - ముఖ్యంగా, జబ్బు చేసిన మనిషికి ఎప్పుడు తిండిపెట్టాలి, ఎప్పుడు ఎండ బెట్టా లన్నది.

జీవితోద్వేగమంతా ఇప్పుడు నారాయణకు ఇంటివెలపలే కనిపిస్తుంది. నిజాము రాజ్యం కాంగ్రెసు నాయకులకు లొంగిరాలేదు. అక్కడ రజాకారు ఉద్యమం సాగింది. పాకిస్తానునుంచి ఆయుధాలు దిగుతున్నాయి. నాగభూషణమూ, వెంకట్రా

మయ్యా కుటుంబాలతోసహా పారిపోయివచ్చి, తాత్కాలికంగా పార్వతి ఇంట దిగారు. పార్వతి అద్దెకున్నవాళ్ళచేత ఇల్లు ఖాళీ చేయించింది అన్నలకోసం.

పోలీసుచర్య; కమ్యూనిస్టులు తెలంగాణాలో సాగించిన పోరాటం; తరవాత కమ్యూనిస్టుల వేట; కాటూరు, యలమర్రు గ్రామాల్లో పోలీసుల అత్యాచారాలు; కాశ్మీరులో కుంపటి.

ఇంకా దూరం పోతే కొరియాలో అంతర్జాతీయ జెండాకింద అమెరికనుల నరమేధం. అన్ని ఖండాలలోనూ నెగళ్ళమంటలు. చీనాలో మరోపెద్ద కమ్యూనిస్టు రాజ్యం. చీనావాళ్ళు కొరియాలో అమెరికనుల మాడు పగలగొట్టటం.

"హిందీ–చీనీ భాయి–భాయి."

"బోలెడంత సందడి! ఇంకా ఎన్నో సందళ్ళు – సినిమా సందడి, సినిమా తారల సందడి, సినిమా పత్రికల సందడి, బాలట్లు. "ఈ సంవత్సరపు ఉత్తమ నటుడు, ఉత్తమ నటి," డిటెక్టివు పుస్తకాల సందడి. ఇంగ్లీషు డిటెక్టివ్ పుస్తకాలకు ఎక్కడలేని గిరాకీ. తెలుగు పాకెట్ పుస్తకాల ప్రజాసాహిత్యం. బళ్ళకొద్దీ, అటునుంచి ప్రజానాట్యమండలవాళ్ళ సినిమాప్రవేశం. సినిమా చిత్రాల చలామణీలో కొత్త రికార్డులు. పుస్తకాలమీద డబ్బు చేసుకోవటంలో కొత్తరికార్డులు. డిటెక్టివు రచనలు చేసేవాళ్ళలో తారలు. మధ్యలో మోసం – దగా – దురన్యాయం!

కిల్లీకొట్లవాళ్ళు లజాకూ బేడకూ ఉత్తమ డిటెక్టివు సాహిత్యాన్ని అరువిచ్చి, ఉత్తమ డిటెక్టివు సాహితీపరులమీద పెద్దదెబ్బ తీశారు. పదిహేను ఇరవయ్యేసివేల కాపీలు అమ్మవలిసిన పుస్తకాల సేల్సుకు మూడువేలకూ, అయిదువేలకూ దిగిపోయాయి. దీనికి విరుగుడు లేదా? పుస్తకాలు సీల్ చేసి పంపండి. సీలులేని కాపీలను కొనకండి. ప్రతి కిల్లీకొట్టూ ఒక చిన్న సర్క్యులేటెడ్ లైబ్రరీ అయిపోయింది. ఈ కిల్లీకొట్లవాళ్ళని జైల్లో పెట్టటానికి ఉందేమో లాయర్లను సలహా అడగండి.

అరణ్యరోదనం. ఒకప్పుడు నారాయణ ఇంకొక అరణ్యరోదనం విన్నాడు. సాహిత్యంమీద ఎట్లా బతకటం? లైబ్రరీలవాళ్ళు ఒక్కొక్క కాపీ కొంటే, దాన్ని యాభైమంది చదువుతారు. ఏ సాహిత్య గ్రంథమూ గట్టిగా వెయ్యికాపీలు అమ్మకుండా ఉంది. లైబ్రరీలే లేకపోతే కనీసం పదివేలు అమ్మను!

ఇప్పుడది వెనకపడింది. ఇప్పుడు సాహిత్యగ్రంథాలను ఎవరూ కొనటంలేదు, లైబ్రరీలే కొంటున్నాయి.

కిల్లీకొట్లద్వారానే డిటెక్టివు పుస్తకాలు వేలకొద్ది అమ్మింది. ఆ కిల్లీకొట్టే ఈ

నాడు డిటెక్టివు రచయితల పాలిటి శత్రువులై కూర్చున్నాయి. ఓడలు బళ్ళూ, బళ్ళు ఓడలూ కావటం ఇదే మరి.

డిటెక్టివు పుస్తకాలమీద వాటిని రాసినవాళ్ళు డబ్బు చేసుకున్నారంటే. ఆశ్చర్యం లేదు. డిటెక్టివు పుస్తకాల తాకిడితో నారాయణ ప్రెస్సు అహోరాత్రాలు అవిరామంగా పనిచేసింది. అట్లా సంపాదించిన డబ్బుతో నారాయిణ తనప్రెస్సును చాలా పెంచాడు. కాని, పెరుగుట విరుగుటకొరకే అన్నట్టు ప్రెస్సు పెద్దదయాక డిటెక్టివుపుస్తకాల గిరాకీ చప్పున పడిపోయింది.

నిజానికి అతను ఏదన్నా పత్రిక పెట్టాలంటే ఇదే కారణం. కాని ఈ లోపుగా వారపత్రిక అమ్మకాలు ఆకాశానికి లేచిపోయినయి.. సిలండరు మెషీను పెట్టుకుని రోటరీలతో ఎట్లా పోటీ చెయ్యటం - బ్లాక్ మేకింగ్ అయినా లేకుండా? నారాయణ వారపత్రిక పెట్టే ఆలోచనను కట్టిపెట్టాడు. ఏమీ చెయ్యకపోయినా అతనికి నష్టమేమీ లేదు. నెలకు ఏడెనిమిదివందల రూపాయలు ప్రెస్సుమీద వస్తూనే ఉన్నది ...

అతనికి ఎప్పుడైనా మనసులో ముల్లులాగా తగిలేది తల్లిగురించే. ఆవిడ పెద్దదై పోతూంది. అదృష్టవశాత్తూ ఆరోగ్యం అంతగా దెబ్బతినలేదు. కాని ఒళ్ళు మరీ వచ్చేసింది. ఆవిడ సామాన్యంగా ఉత్తరం రాయదు. ఉన్నచోట ఆవిడ సుఖంగా ఉన్నదని తెలిస్తే నారాయణకు ఏ విచారమూ లేదు.

బంధువుల ఇళ్ళలో అక్కరలేనైనా అయినప్పుడు పిలిచేవాళ్ళు. కాని నారాయణ ఎప్పుడో తప్ప వెళ్ళేవాడు కాడు. దారితప్పి వెళ్ళితే తప్పక పశ్చాత్తాపపడేవాడు. బంధువులందరూ కూడబలుక్కున్నట్టుగా ఒకేవిధంగా మాట్లాడేవాళ్లు.

"నువు మీ అమ్మను అట్లా వెలివేశా వెందుకూ? అయినవాళ్ళం ఇక్కడ ఇంత మందిమి ఉంటిమిగదా, మమ్మల్ని చూడాలని అనిపించదా! నువ్వక్కడ బాగా డబ్బు చేసుకుంటూనే ఉండవచ్చు, కాని మనిషికి డబ్బొక్కటేనా?"

ఇటువంటిమాటలు నారాయణకు విచిత్రంగా వినిపించేవి. ఒక మనిషి ఇంకో మనిషిని ఎట్లా వెలివేస్తాడు? అట్లా ఎవరినన్నా వెలివేస్తే, తానా మనిషికి వెలికావటమేగా? "నువు మీ అమ్మకు ఎందుకు వెలి అయావు?" అని ఒక్కరూ అడగరు. ఒకమనిషిని వెలి వెయ్యటానికి అవతల ఒకసంఘం ఉండాలి. అటువంటి సంఘం తన బంధువర్గంలో ఎక్కడా కనపడలేదు. అందరూ ఎవరి బతుకులు వాళ్లు బతుకుతున్నారు. ఒకరి నొకరు ఆదుకోవటమనేది వాళ్ళమధ్య ఏమీ ఉన్నట్టు లేదు. "పాపం, రత్తయ్యకుటుంబం చాలా కష్టాలు పడుతున్నారు. ఒక్కోపూట తిండి

కూ్కడా ఉండటంలేదు." అని ఎంతో జాలిగా చెప్పేవాడు. ఆ రత్తయ్యకు ఓ మానెడు బియ్యం ఇచ్చినట్టుకూడా చెప్పడు.

తన బంధువులకు తనమీద నిజంగా ఏపాటి ఆపేక్ష ఉన్నదీ నారాయణకు తెలీదు. కాని వాళ్ళను అడపా దడపా చూడాలని తనకు లేని తహతహ వాళ్ళకు తనను చూడాలని ఉన్నట్టు నారాయణ నమ్మలేకపోయాడు. తనకు ఆపేక్షలూ, అంతఃకరణలూ లేవని తప్పు పట్టటానికి వాళ్ళకు అవకాశం చిక్కింది. దాన్ని వాళ్లు ఉపయోగించుకుంటున్నారు. నిజంగా ఆపేక్షలూ అభిమానాలూ ఉండేవాళ్ళు అయితే వాళ్ళు తమఎదట ఉన్నవాళ్ళతో అస్తమానమూ పేచీలు పడరు. ప్రతివాడూ మిగిలినవాళ్ళను గురించి ఏదో నసపెట్టేవాడే!

చివరకు పార్వతికీ, అన్నలకూకూడా పడలేదు. వాళ్ళు నిజామునుంచి వచ్చి తమ ఇంటనే ఉంటున్న కాలంలో ఒకసారి నారాయణఇంటికి వెళ్ళాడు. చిన్నప్పుడు తనను ఎత్తుకుని మోసి మురిసిన మేనమామలను అతను గుర్తించలేకపోయాడు. వాళ్ళు తమ కష్టాలను గంటలతరబడి చెప్పుకున్నారు. చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్పారు. తెలంగాణాలో కమ్యూనిస్టులు చేసిన "రాక్షస కృత్యాలను" వాళ్ళు మహా భయంకరంగా వర్ణించారు. వాళ్ళ కష్టాలకు కమ్యూనిస్టులు కూడా కారణమే. కాంగ్రెసువాళ్ళు నిజాము నవాబును అట్లా రెచ్చగొట్టి ఉండకూడదు.

ఈ మాట లన్న మేనమామలు తరవాత తిరిగి వెళ్ళి కాంగ్రెసు కొమ్ము కాస్తారని నారాయణ కలలోకూడా అనుకునిఉండడు.

తన తల్లిని తనదగ్గిర వచ్చి ఉండమని నారాయణ చాలాసార్లు అడిగాడు. తల్లికి రాసినవి కొద్ది ఉత్తరాలేఅయినా ప్రతి ఉత్తరంలోనూ ఆమాట అన్నాడు.

"ఎందుకులేరా! ఇక్కడ నాకు పిలిస్తే పలికేవాళ్లున్నారు. ఇంటో ఏమీ తోచనప్పుడు వెళ్ళటానికి ఎన్నో కొంపలు; అక్కడ ఏముంది? ఏం కావలిసినా నిన్నూ, నీ పెళ్ళాన్నీ బాధపెట్టాలి. ఎక్కడికీ పోవటానికుండదు. ఇట్లాగే వెళ్ళమారి పోనీ" అనేది పార్వతమ్మ.

నారాయణ తన తల్లితో ఇప్పుడిప్పుడు ఒక తేడా గమనిస్తున్నాడు. అదివరకల్లా సమస్యలు తెచ్చిపెట్టటం ఆవిడవంతుగా ఉండేది. ఆ సమస్యలకు సులభ పరిష్కారం ఉండేది కాదు. నారాయణ ఇరుకున పడ్డట్టయేవాడు. ఇప్పుడు నారాయణ తన అంతర్మాను తృప్తి పరచుకోవటానికి ఒక సమస్య తెచ్చిపెట్టుకోవటమూ, తల్లి ఆ సమస్య ఏర్పడకుండా చూడటమూ అవుతున్నది. పార్వతమ్మ మాటలలో




పూర్వం లేని వేదాంతం ఏదో ఉంటున్నది. అదివరకులాగా ఆవిడ తన కొడుకును వలవేసి పట్టుకోవటానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యటం లేదు. ఆమె అటువంటి ప్రయత్నం చేసిఉంటే నారాయణకు తల్లిమీద సానుభూతి ఉండేదికాదు; కాని ఇప్పుడు అతని అంతరాత్మ మరింత బాధపడసాగింది.

ముంచుకొచ్చే ముసలితనంలో తల్లి దిక్కులేనిదానల్లె ఒంటరిగా ఉండటమేమిటి? రోగం వచ్చినా, రొష్టు వచ్చినా ఎవరో వచ్చి చెయ్యటం ఏం బాగుంటుంది?

కిందటిసారి తల్లిని చూసినప్పుడు నారాయణ, ఆవిణ్ణి తన దగ్గిరికి వచ్చిఉండమని పిలుస్తూ ఆమాటే అన్నాడు.

పార్వతి నవ్వి, "నలుగురూ ఏమనుకుంటారనిట్రా నీ బెంగా? ఇదెప్పట్నుంచీ? ఎవరేమనుకున్నా నీకు లక్ష్యం లేదనుకుంటున్నానే, ఇన్నాళ్ళూ?" అన్నది.

నారాయణ ఆట కట్టయిపోయింది.

*　　　　*　　　　*　　　　*

నిజానికిప్పుడు పార్వతి మనస్సులో లోతైన విచారా లేవీ లేవు. మనసు డొల్లగా వున్నప్పుడే ఇతరులపట్ల అసంతృప్తి జాస్తిగా ఉంటుంది. ముప్పైఏళ్ళు వచ్చినదాకా పార్వతి మనసు నిండుగానే ఉన్నది. భర్తతో తనకు ఏమాత్రమూ సహించని దాంపత్యజీవితం గడిపింది; భర్తకు దూరంగా వచ్చేసి పుట్టింటివాళ్ళ అండ చేరింది_అప్పుడు కూడా పార్వతి మనసు నిండుగానూ, నిబ్బరంగానూ

ఉన్నది. తన మనస్సులో కొడుక్కి పెద్ద ఆవరణ కేటాయించింది. అందులో నుంచి నారాయణ క్రమంగా బయటికి వెళ్ళిపోవటంతో ఆమె మనసు డొల్ల కానారంభించింది.

పార్వతి జీవితంలో పొందిన బాధ యావత్తూ నారాయణ మూలాన కలిగినదే. వాడు తన జీవితాన్నీ, తన ప్రేమనూ, తన తపస్సునూ వ్యర్థం చేశాడు; వాటిని అవమానించాడు; వాటికి ద్రోహం చేశాడు. బుద్ధిపూర్వకంగా చేశాడా, తెలీక చేశాడా అన్నది పార్వతమ్మకు పట్టలేదు. ఆవిడ తనను గురించే ఆలోచించుకుని బాధపడింది. ఒక ఏడు కాదు, రెండేళ్ళు కాదు, ఇరవై ఏళ్ళు—గిలగిలా కొట్టుకున్నది. కొడుకుపట్ల తనకు గల భావంలో చిన్న చిన్న ద్వేషాలు—పులిమజ్జిగలో పురుగుల్లాగా—పుట్టుకురావటంకూడా ఆమె గుర్తించలేదు. అవి ఆమెలో కలిగిన ప్రతిక్రియా శక్తులు. అవి ఆమెకు తన పుత్రప్రేమయొక్క సహజపరిణామాలుగానే కనపడ్డాయి. పెద్దవాళ్ళు పిల్లల తప్పులకు దండించడంలో ప్రేమ ఉండదని ఎవరనగలరు?

పార్వతమ్మ తన మనసులోని డొల్లను డబ్బుతో నింపాలని చూసింది; అది కూడా స్వాభావికమేనేమో. డబ్బుతో చాలా ఖాళీజాగాలను నింపవచ్చు. మనిషి యొక్క పరిస్థితిని బట్టి కొద్దిపాటి డబ్బయినా కొలపరానంత ఆనందాన్ని ఇస్తుంది. బొత్తిగా బీదవాడు కానివాడికూడా రోడ్డుమీద ఒక పావలా కాసు దొరికితే, వణుకు పుట్టించే చలిలో చలిమంట దగ్గర కూర్చుంటే కలిగేటంత తృప్తి చాలా సేపు కలుగుతుంది. అయితే డబ్బుతో వచ్చే చిక్కేమిటంటే, నిషా పస్తువల్లే, అది పోయినకొద్దీ పెద్ద డోసులు కావాలి. ఒక దశలో బాంకుపడ్డ రూపాయి పావలా వస్తే తన్మయత్వంచెందేవాడు, కొన్నాళ్ళయాక పాతిక రూపాయిల వడ్డీకి కూడా అంతగా చలించడు. పార్వతికి అదికూడా అనుభవం అయింది.

చిట్టచివరకు పార్వతికి వేదాంతం దొరికింది. ఇంట్లో అద్దెకుంటున్న ఆంజనేయులుగారు పెద్ద వేదాంతి. ఇంట్లో ఉండేగి నలుగురూ—ఆయనా, భార్యా, కొడుకూ, కోడలూను. ఆయన మిగిలినవాళ్ళకు అంటడు. మిగిలిన ముగ్గురూ సాధారణంగా ఆయన లేనట్టే ప్రవర్తిస్తారు. ఆయనను పలకరించరు. ఆయన మాట్లాడేది వినిపించుకోరు. ఆయనతో ఏదీ సంప్రదించరు. ఈ పద్ధతి ఆంజనేయులు గారికి ఏమాత్రమూ అభ్యంతరం ఉన్నట్టు కనిపించలేదు. ఆయనకూడా వాళ్ళు లేనట్టే ఉంటాడు.

ఆంజనేయులుగా రబ్బాయి సీతాపతి స్కూల్లో మేస్టరు పని చేస్తున్నాడు. పొలాల మీద తృణమో పణమో వస్తుందల్లే ఉంది. ఆ అబ్బాయికి తల్లి అంటే ఎంత గురి!

ఆవిడకు వాడంటే ఎంత నమ్మకం! వాళ్ళ కోడలు కూడా చాలా బుద్ధిమంతురాలు. ఎప్పుడూ మాట్లాడినట్టే ఉండదు. అత్తగారు గీసిన గిరి దాటదు. అత్తాకోడళ్ళ వైరం వీళ్ళలో కంచుకాగడాలు వేసి చూసినా కనిపించదు.

ఆంజనేయులుగారి మాటలు మిగిలినవాళ్ళ కెందుకు పట్టవో పార్వతికి అర్థం కాలేదు. వారానికి ఆయన ఒకక్కముక్కే అన్నా, అది పార్వతికి పరమసత్యంగా ఉండేది.

"జన్మంటే ఏమిటి? గాఢాంధకారంలో ఒంటరిగా ప్రయాణించి వస్తాం. నాలుగు రోజులపాటు నలుగురితోనూ కలిసిఉన్నట్టు భ్రమపడతాం. మాయ అనేది జీవాత్మకూ పరమాత్మకూ మధ్య తెరలాగా వున్నదంటారు గాని, నన్నడిగితే ఒక జీవాత్మకూ, మరో జీవాత్మకూ మధ్య కూడా ఈ తెర ఉండనే ఉన్నది. ఒకరి జీవాత్మ ఏం చేస్తున్నదీ ఇంకొకరి జీవాత్మకు అంతు చిక్కదు—అది తెలియరాని దేవ రహస్యం. వీడు మంచివాడనీ, వాడు చెడ్డవాడనీ, వీడు మంచిపని చేశాడనీ, వాడు చెడ్డపని చేశాడనీ, వీడు అయినవాడనీ, వాడు కానివాడనీ మనం భ్రమపడతాం. నిజానికి, పరమాత్మ ఎంత నిర్వికారమో, జీవాత్మ కూడా అంత నిర్వికారమే. పైకి దేవత్వం కనపడితే అడుగున దాని ప్రమాణంలో రాక్షసత్వం వుంటుంది. పైకి రాక్షసత్వం కనబడితే కనబడకుండా అంత దేవత్వమూ వుంటుంది. కాని మాయాజీవితంలో మునిగితేలే మనకు కనపడేదే లెక్కలోకి వస్తుంది. చూడరాదా? పౌర్ణమినాడు ఎంత పెద్ద చంద్రుడుంటాడో అమావాస్యనాడూ అంత పెద్ద చంద్రుడుంటాడు. కాని మనకు ఆనాడు చంద్రుడు లేనట్టే లెక్క! ఎంచేతా? మనం ఆ చంద్రుడి కాంతికే విలవ ఇస్తాం గనక! అది మన స్వార్థం. ఇవన్నీ పాక్షికమైన అంచనాలు. వాటితో జీవించినంతకాలమూ మనకు నిజంతో పని ఉండదు. అసలైన సత్యం ఈ మానవజన్మకు తెలియటమే కష్టం. తెలిసినా ఉపయోగపడటం అసాధ్యం. అందుచేత మాయలో పుట్టినవాళ్ళం మాయలో జీవించక తప్పదు. ఇక మన చేతిలో ఉన్న దేమిటయ్యా అంటే, మాయ అని తెలుసుకుంటూ, గుర్తుంచుకుంటూ జీవించటం..."

ఈధోరణిలో ఆంజనేయులుగారు మాట్లాడేవాడు. అదేంచిత్రమో, ఆయన నోటిమాట పార్వతితలకు సూటిగా ఎక్కేది. ఒకొక్కక్కళ్ళు గంటసేపు మాట్లాడి వెళ్ళినా వాళ్ళు మాట్లాడినముక్కలు మూడు నాలుగుమించి జ్ఞాపకం ఉండవు. ఆంజనేయులుగారు చెప్పేమాటలు మరుద్దామన్నా పార్వతికి సాధ్యపడ్యేదికాదు.

పార్వతి ఆయనను అప్పుడప్పుడూ అనుమానాలు అడిగేది.

''నాయనగారూ, కిందటిజన్మలో చేసుకున్నకర్మకు ఫలం ఈజన్మలో కలుగుతుందని నమ్మవచ్చునా ?" అని ఆమె ఒకసారి అడిగింది.

ఆంజనేయులుగారు చిన్నగా నవ్వి. "తల్లీ, ఏకర్మఫలం ఎంతకాలం ఉంటుందో ఎవరుచెప్పగలరు ? అరగనిది తిన్నదోషం ఒక్క అజీర్ణం మాత్రతో పోతున్నది. గాయాలూ, బొబ్బలూ తెచ్చుకుంటే కొంతకాలానికి మానుతున్నాయి. స్వర్గమూ. నరకమూ ఉన్నాయంటున్నారు. చేసిన పాపాలకూ, పుణ్యానికీ ప్రతిఫలం అక్కడే ముట్టేట్టుంటే మళ్ళీపునర్జన్మ దేనికి కలుగుతున్నట్టూ ? ఈజన్మలో మనం చేసేదంతా పూర్వజన్మ కర్మప్రేరణతో జరిగేమాటుంటే ఈజన్మలో చేసేదానికి మరోజన్మలో అనుభవించటం ఎట్లా జరుగుతుందీ ? కర్మసిద్ధాంతమే ఇంత అయోమయంగా ఉంటే, ఇందులోకి దేవుణ్ణి ఒకణ్ణి ప్రవేశపెట్టారు ; వాడు చేసే దేమిటీ ?" అన్నాడు.

పార్వతి నిర్ఘాంతపోయి, "అయితే దేవుడు లేడంటారా ?" అన్నది.

"లేడనీ, ఉన్నాడనీ మధనపడటం దేనికి, తల్లీ ? నేనీవిషయం ఆలోచించి తేల్చిన దేమిటంటే, మనమే దేవుడుకాని పక్షంలో బయట ఎక్కడా దేవుడు లేడనే ! వాణ్ణి సర్వాంతర్యామి అన్నారుగద ! మనలోనూ ఉండేఉండాలి. సర్వసాక్షి అన్నారుగద ! మనం సాక్షులంకదూ ? నామనస్సులోఉండే ఆలోచనలు నీకు తెలియకపోవచ్చు. నాకుతెలుసునే ! అందరికీ అన్నీ తెలియకపోవచ్చు. కాని సాక్షిత్వం లేకుండా ఏఒకటీ జరగదు. ఎవరింటోనో రేడియో పాడుతుంటుంది. రేడియో మనకు కనిపించకపోయినా పాటకు గాలిసాక్షిగా ఉండనేఉన్నది. అంతా భగవంతుడే. గుళ్ళో ఉండే రాయికిగల సాక్షిత్వంకన్న మనలో ఉండే సాక్షిత్వం హెచ్చు." అన్నారు ఆంజనేయులుగారు.

మరోసారి పార్వతి పునర్జన్మగురించి అడిగింది.

"పునర్జన్మగురించి నేనే విచారమూపడను. మనం ప్రత్యక్షంగా అనేక పునర్జన్మలు చూస్తున్నాం. భూమిమీద పడిన విత్తు చీకి, విత్తు జన్మ చాలించి, చెట్టుజన్మఎత్తుతున్నది. సీతాకోక చిలుకలు గుడ్లు పెడుతున్నాయి. అవి కొంతకాలం పెరిగి నశించగా, వాటినుంచి మళ్ళీ సీతాకోక చిలుకలు పుట్టుకొస్తున్నాయి. జడపదార్థాలకు కూడా జన్మ పరంపర ఉంటున్నది గద ! నీరు ఎండకు ఇగిరి పైకిపోయి, మేఘమై. కొంతకాలం పైనే తిరిగి, చివరకు నీరుగా అవతరిస్తుంది. అంతదాకా దేనికమ్మా ? మనం ఒక్క జీవితంలోనే ఎన్నో జన్మ లెత్తటంలేదూ ?

"నా కిప్పు డరవైఅయిదోఏడు జరుగుతున్నదనుకో, వెనక్కి తిరిగి చూసుకుంటానా, ఎన్నో జన్మలు గడిచిన ట్లనిపిస్తుంది. ఒకదానికీ ఇంకోదానికీ సంబంధం




లేదు. నేను పుట్టిననాటికి ఈ ప్రాంతాల రైలుగూడా లేదు. కార్లు లేవు. బస్సులు లేవు. ఇవాళ చెవుల్లో రేడియోలమోతా, నెత్తిన విమానాలమోతా, సినిమాలూ, రేపు ఆకాశంలో మనుషులు విహరిస్తారంటున్నారు. రజస్వలఅయిన పిల్లలకి పెళ్ళిళ్ళు చేసేస్తున్నారు. ప్రపంచంలో ఎన్నో మార్పులు. ధర్మంలో ఎన్నో మార్పులు; మారే శరీరంలో మారని ఆత్మల్లాగా మనం అట్లాగే వున్నాం." అంటూ ఆంజనేయులుగారు ఓ విధమైన స్వాగతం చదివాడు.

ఆయన చెప్పేవి కొన్ని కొన్ని పార్వతికి అర్థమయేవికూడా కావు. ఒకసారి వెంకటేశ్వర్లు వచ్చినప్పుడు ఆంజనేయులుగారు అతనితో చాలా 'వేదాంతం' మాట్లాడాడు. పార్వతికి అది అంతు చిక్కలేదు.

"నేను" అన్నది అన్ని భ్రమలలోకీ గొప్ప భ్రమ అనీ, అసలు వ్యక్తి అనేది సృష్టిలోనే లేదనీ, ఒక పేరు పెట్టటానికి వీలైన సమిష్టికి మనం వ్యక్తిత్వం అంటగట్టుతున్నామనీ ఆంజనేయులుగారు వాదించాడు.

"ఆ మాట ఎట్లా అనగలరు?" అని వెంకటేశ్వర్లు ఆక్షేపించాడు.

"ఎందు కనలేం? మీ యిష్టం వచ్చిన ఏ వ్యక్తినన్నా చెప్పండి, అది సమిష్టి అనీ, అందులో చేరినవాటన్నిటికీ వేరే వ్యక్తిత్వం ఉన్నదనీ. అవి మళ్ళీ సమిష్టులేననీ నేను రుజువుచేస్తాను. ఒక మనిషిని తీసుకోండి, వాడిలో వ్యక్తిత్వం ఎక్క-

డున్నది? వాడి శరీరంలో ఎన్ని ధాతువులు! ఎన్నికోట్ల జీవకణాలు! తమ పని తాము చేసుకుంటూపోయే గుండెకాయ, ఊపిరితిత్తులు, గ్రంథులు, రక్తప్రవాహం, మెదడు, నరాలు! వాటి జీవితాలు వాటి కున్నాయి. శరీరం ఓ పెద్ద ప్రపంచం అందులో ఎన్నో జీవరాసులు_వాటివాటి ప్రత్యేక జీవితాలు! కొన్ని కొద్ది క్షణాలు మాత్రమే బతుకుతాయి; కొన్ని ఈ ప్రపంచం ఉన్నంతకాలమూ ఉంటాయి. మాటవరసకు చెబుతా, భూదేవి అంటూ ఒకతె నిజంగా ఉందేమో! ఉండి తా నొక వ్యక్తిననుకుంటున్నదేమో!...ఉంటే మనకు కనిపించదా అనకండి. మన శరీరంలో ఉండే రక్తకణాలకు మనం కనిపించం. అవి నివసించే ప్రపంచం ఒక వ్యక్తి అన్నది వాటికి ఊహించరాని విషయం!...ఇంకో చిత్రం చూశారో, లేదో_ మన లోపల ఉన్న సమిష్టత్వం మనకు చాలటం లేదు; బయటినుంచి సమిష్టిత్వాన్ని వెతుకుంటున్నాం పదిమంది చేరి తమ వ్యక్తిత్వాలను కలగలుపుకున్నప్పుడే మనకు ఆనందమూ, ప్రయోజనమూ ఉంటున్నది. వ్యక్తిత్వాన్ని సమిష్టిలో లీనం చెయ్యటానికి నా చిన్నతనంలో భజనలు చేసేవాళ్లు, పురాణాలు వినేవాళ్ళు, తోలు బొమ్మలాటలు చూసేవాళ్ళు, ఉత్సవాలు చేసేవాళ్లు. తరవాత ఉద్యమాలు వచ్చాయి. ఈనాడు ఈ సినిమాలూ అవీ అందుకే ఉపయోగపడుతున్నాయి. కళలకున్న ప్రయోజనంకూడా అదే_వ్యక్తులను ఒక సమిష్టిగా రూపొందించటం...నన్నడిగితే, నిజమైన వ్యక్తిత్వం ఉన్నది పరమాత్మకు మాత్రమే. ఆ పరమాత్మకూడా వ్యక్తిత్వంతో తృప్తిచెందలేక సమిష్టిత్వాన్ని ఆశ్రయించవలసివచ్చింది. ఆ కారణం చేతనే ఈ సృష్టి అంతా నడుస్తున్నది,'' అన్నాడు ఆంజనేయులుగారు.

వెంకటేశ్వర్లు పార్వతమ్మతో, ''ఆయన చెప్పేది వేదాంత మవునోకాదోగాని, అది ఒకరికి చెరుపుచేసేది మాత్రం కాదు," అన్నాడు.

* * *

పార్వతి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తున్నది. ఆమెకు అయాసం జాస్తి అవుతున్నది. ఏ మాత్రం కదలటానికీ, పని చేసుకోవటానికీ ఓపిక లేకుండా ఉన్నది. అద్దెకున్నవాళ్ళ కోడలు, పాపం, కొన్ని పనులు చేసిపెడుతున్నది.

ఏ వైద్యుడిసలహా అయినా తీసుకుని మందుపుచ్చుకునే ఆలోచన పార్వతికి ఏ మాత్రమూ నచ్చలేదు.

"ఒళ్లు, పాపంపెరిగినట్టు పెరిగిపోయింది. ఆయాసం ఉండకేం జేస్తుంది?'' అని ఆవిడ సరిపెట్టుకునేది.

వైద్యుడికి చెప్పినంతమాత్రాన సలహా కేమీ లోటు రాలేదు. కొందరు తిండి మానెయ్యమన్నారు. కొందరు తొట్టిస్నానాలు చేసి, పచ్చికూరలు తినమన్నారు. ఇటువంటి రోగాలకు రంగుసీసాల నీళ్లు చాలా అద్భుతంగా పనిచేస్తాయన్నారు. కొందరు గుండెలకు అమృతాంజనం రాయమనికూడా సలహా ఇచ్చారు. ఏ జాతి విజ్ఞానరహితమై, అర్థం లేని నమ్మకాల ఆధారంతో కాలక్షేపం చేస్తుందో ఆ జాతిలో అన్నిరకాల అజ్ఞానాన్నీ అందరూ ప్రదర్శిస్తారు. వైద్యం డాక్టర్లకే తెలుసుననీ, సంగీతం విద్వాంసులకే తెలుసుననీ అటువంటిజాతి అనుకోదు. ప్లీడర్లతోబాటు చెట్టుకింద ప్లీడర్లూ, వైద్యులతోబాటు చిటాకావైద్యులూ, వేదాంతులతోబాటు గంజాయితాగేవాళ్లూ, దేవతలతోబాటు గ్రామదేవతలూ, పిల్లలను పెంచటం చాతకాని తల్లులూ, పెళ్ళాలతో కాపరం చెయ్యటం చాతగాని భర్తలూ, విషయంతో పరిచయం లేని విమర్శలూ అటువంటిజాతిలో జాస్తీగా ఉంటాయి.

చివరకు పార్వతి మంచాన పడింది.

ఆంజనేయులుగారు నారాయణకు టెలిగ్రామిచ్చారు, వెంటనే బయలుదేరి రమ్మని. మర్నాటికల్లా నారాయణా, పిల్లలూ, సావిత్రీ, సీతా, ఆవిడ పిల్లలూ దిగారు. రామకృష్ణ వెంటనే బయలుదేరలేకపోయాడు.

పార్వతి నారాయణను తన మంచంమీద కూర్చోమని, కొడుకు చేతులూ, వీపూ నిమిరింది.

''ఇక్కడ ఇన్నాళ్ళు వైద్యం లేకుండా ఎందుకున్నావు? మాతో వచ్చెయ్యి. నీకు మంచివైద్యం చేయిస్తాను.'' అన్నాడు నారాయణ.

"ఎందుకురా? నన్ను ఈ సారికి చావకుండా బతికిస్తానంటావు! అంతేనా? ఇంకోసారి చద్దువుగానిలే అంటావు! ఎప్పుడయితే నేంరా? ఎన్నాళ్లు బతికినా నేను చేసే దేమీలేదు, నాయనా! ఎప్పుడు మాత్రం ఏం చేశాను? ఏమీ లేదు. పదేళ్లుగా చావు ఎప్పుడొచ్చినా సిద్ధంగానే ఉన్నాను. నాకు ఈ ఆయాసం తప్ప వేరే బాధ ఏమీలేదు. నాకు ఒక్కటే విచారం, నాయనా! నిన్ను ఎట్లా పెంచాలో చాతకాక దూరం చేసుకున్నా...మన అద్దెకున్నవాళ్ళబ్బాయి — ఆ తల్లీ కొడుకులు ఎంత ప్రేమగా ఉంటారు! వాళ్ళను చూస్తే ముచ్చటేస్తుంది!...అన్నది పార్వతమ్మ.

ఆవిడ జీవితానుభవం వడగట్టితే చివరకు తేలిననిగ్గు ఆ రెండుముక్కలే.

నారాయణ డక్టరును తీసుకొచ్చాడు. డాక్టరేవో ఇంజక్షన్లనిచ్చాడు. కాని అవేవీ పనిచేసినట్టు లేదు. నారాయణ వచ్చిన నాలుగోరోజు రాత్రి పార్వతి ప్రశాంతంగానూ, శాశ్వతంగానూ కన్నుమూసింది.

స మా ప్తం

# కల కావలసిన నిజం

"అడ్డచారల తాబోందుమీద వుప్పాడ సన్నజరీ కండువా వల్లె వాటు. ముద్దు ముద్దుగా వాటిని పొదివి పట్టుకొని గంటల మొలనూలు. మెడలో పైటమీద యెగుడుదిగుడుగా పచ్చల పతకం. ముక్కున నత్తూ బులాకినీ, చెవులకు జూకాలు, కర్ణ పువ్వులూ, జావిలీలూనూ; చేతులకు మురుగులు, మురిడీ గొలుసులు, పోచీలు, కంకణాలు, భుజబందులు, శిరస్సున సూర్యుడు, చంద్రుడు, పాపిడీ పింగరీలు, తమలపాకు, మొగలిరేకు, తెగబారెడు బంగారు జడ. దానికి గుత్తులు గుత్తులుగా గంటలు."

* * *

మొత్తానికి హైదరాబాదు నలుగురూ చెప్పుకొని సంతోషించతగ్గ పట్టణమనే వొప్పుకోవాలి. పట్నంలో దేనికైనా చోటుంటుంది. కళలకూ, సాహిత్యానికీ, సంస్కృతికీ మరీ ఎక్కువ చోటే ఉంటుంది. కనీసం వాటి పేరుమీదుగా చెలామణీ అయ్యే జనం ఎక్కువ. సంస్థలూ ఎక్కువే. అటువంటి చక్కని హైద్రాబాదులో మనబోటివారి సంస్కృతీ, సాహిత్యాలకూ, కళాపోషణకూ, చిహ్నాలని అంతా అనుకొని మురిసే రెండు భవంతులు వెలసి ఉన్నాయి. ఒకటి కళాభవనం, రెండోదేమో రవీంద్ర భారతి.

పోతే మూడేళ్ళ కిందట అనుకుందాం, ఒకానొకరోజు సాయంకాలం సుమారు ఏడు గంటల ప్రాంతాలలో రవీంద్ర భారతి, ఆహూతులైన ప్రేక్షక జనంతో దాదాపు కిటకిటలాడి

పన్యాల రంగనాథరావు

పోతున్నది. ముందు వరసలలో మామూలు ప్రకారమే కొంతమంది మంత్రులూ, వారి కావలసినవారూ, పలువురు పలుకుబడిగల పెద్దలూ, ఆసీనులై ఉన్నారు. ఆనవాయితీ చొప్పున అయిదో వరస పత్రికలవారికి ప్రత్యేకించారు. ఆ వరస మధ్యలో కూర్చున్న ప్రసాదు, ఒక దినపత్రికలో రిపోర్టరుగా చేరి ఇంకా ఆరునెల్లు కూడా కాలేదు. అనగా పాత్రికేయుడు. తన వరసలో సీట్లన్నీ నిండి పోయి ఉన్నాయి. అంతా పత్రికల వారే. అందులో కొందరిని తను ఈ ఆరు నెల్లలోనూ, చాలాసార్లు చూసే ఉన్నాడు. ముఖపరిచయాలున్నాయి. వాళ్ళలో వాళ్ళకున్న 'రాజకీయాలు' ఇంకా ప్రసాదువరకూ రాలేదు గనక, అతనికి వారితో ప్రత్యేకమైన స్నేహాలు లేవు.

పత్రికా ప్రపంచంలో ప్రసాదుకు బాగా ఆప్తుడైనవాడు అప్పటికి ఒక్కడే ఉన్నాడు. అతను నిరంజన రెడ్డి. బాగా వున్నవాడే. మొదణ్నించీ సినీమాలన్నా, సినీ పత్రికలన్నా, యావ జాస్తిగా ఉన్నవాడు. పెద్ద చదువుల జోలికి పోకుండా, సినీమా పత్రికలకి తరుచూ రాస్తూ, ఇప్పుడు ఒక సినీ వారపత్రిక్కి ప్రతినిధి అయి నాడు. అసలు ప్రసాదునికూడా పత్రికల్లోకి లాగింది రెడ్డే. కలిసి చదువుకునే రోజుల్లో స్నేహం ఎలా ఉండినా, పత్రికలో అడుగుపెట్టాక, ప్రసాదుకి రెడ్డితో సాన్నిహిత్యం ఎక్కువయిందనుకోవాలి. ఇవాళ ప్రోగ్రాముకి ప్రసాదుతోపాటు రెడ్డీ రావలసిన వాడే. ప్రసాదు ఎంత కలయచూసినా రెడ్డి కనపడలేదు.

హాలులో లైట్లు ఆరిపోయినై. స్టేజిపైన ఫ్లడ్ లైట్లు క్రమేపీ కాంతివంతమైనై. ఆ కాంతిలో స్టేజిమీద కొచ్చి మధ్య నిలబడి నమస్కరిస్తున్న భంగిమలో ఉన్న దివ్యసుందర విగ్రహాన్ని చూడగానే, క్షణకాలం నిశ్చేష్టుడై వెంటనే తేరుకున్న ప్రసాదుకి రంగనాయిక జ్ఞాపకమొచ్చింది. ఈ గొడవలో, ముందు జరిగే ఎనౌన్స్‌మెంటుగానీ, నేపథ్య సంగీతం గానీ, ప్రసాదు చెవిలోకి ఎక్కలేదు. అతని దృష్టి, స్టేజిపైన విగ్రహం మీదనే లగ్నమై ఉంది.

"రంగనాయిక !" అనుకున్నాడు ప్రసాదు.

బాగా ఇష్టమైన పుస్తకాలు ఎన్ని సార్లు చదివినా తనివితీరదు. రచయితపట్ల ప్రత్యేకాభిమానం వల్ల కొందరికైతే, రచనలో 'వైశిష్ట్యం' వల్ల కొందరికి కొన్ని కొన్ని పుస్తకాలు అభిమాన గ్రంథాలవుతై. ముఖ్యంగా సాహిత్యాభిరుచీ, రచనా వ్యాసంగం కలవారికి ఈ జబ్బు

కొంచెం జాస్తి. ఈ తరం వారంతా ఈ విషయంలో చాలా ఆరోగ్యవంతులుగా కనిపిస్తారు. వారి కిటువంటి అలవాట్లేవీ ఉంటున్నట్టు కనిపించదు.

ప్రసాదేమో ఈ తరంవాడే మరి! అయితే అతనిలో ఏవో కొద్ది పాత వాసనలు మిగిలి ఉన్నై. మేనమామ పోలికలంటారు. అతని మేనమామ - ఓయబ్బో - ఉద్దండుడు. ఆధునిక రచనా పద్ధతులన్నింటిలోనూ కసరత్తులు చేసి, గొప్ప పేరు ప్రతిష్ఠలు పొందినవాడై, అంతా యీ మధ్యనే కాలం చేశాడు. మేనమామంతటి గొప్పవాడయ్యే నమ్మకం ప్రసాదుకి స్వయంగా లేకపోయినా - అతని ప్రభావంవల్ల రచనా వ్యాసంగంతో పాటు కొందరు గొప్ప రచయితల రచనలపట్ల అభిమానమూ గురీ ఏర్పడ్డాయి.

'వడ్లగింజలు' అని ఒక కథ. వెనకటికి - దాదాపు - తను పుట్టకముందే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రాసినది - తన మేనమామగారి లైబ్రరీలో చూసి ఏనాడో చదివిన కథ. దరిమిలా ప్రసాద్ అదే కథనుఎన్నిసార్లుచదివాడో లెక్కలేదు. వేమన్నగారు పలికినట్టు ఒకటికి మరొకసారి చదివినకొద్దీ మళ్ళీ చదవాలనిపించడమే కాక కొత్త కొత్త భావాలు కూడా స్ఫురిస్తాయనిపించే దతనికి.

ఇంతకి, ఎదురుగా స్టేజిపైన భరత నాట్యం ప్రదర్శిస్తున్న దివ్యసుందర విగ్రహం, ఎవరోకూడా కాదు, ప్రసాదుకి స్వయానా ఆ మేనమామగారి కూతురే. తనకన్నా, అయిదేళ్ళేమో చిన్న. ఏదీ? తనకింకా పాతికేళ్ళన్నా నిండందే! రాత సరిగా ఉండిఉంటే తన కెప్పుడో పెళ్ళాం కావలసింది.

సాహిత్యరంగంలో 'ఒకే రెక్కల పక్షులు' కావడంమూలాన, ప్రసాదుకి మేనమామదగ్గిర చనువు జాస్తిగా ఉండేది. అప్పట్లో-ఎప్పుడనుకున్నారు? బాగా పది పన్నెండేళ్ళకిందటిమాట - ఆయన అంటూఉండేవారు - తన కిప్పటికీ చెవుల్లో రింగు మంటుంది. 'ఎప్పటికేనా నాచిట్టి నీ పెళ్ళామేరా! జెంగెట్టుకోకు!' అని. ప్రసాదులో అటువంటిదేదో జెంగ అప్పటికే స్పష్టంగా కనిపించిఉండాలి - పాపం, ఆ ముసలాయనకి.

ఎంత మేనమామ కూతురైనా, చిట్టిలాంటి అందకత్తెకి, నాట్యంలో అప్పటికే ఆరితేరిన ప్రజ్ఞావంతురాలికి, తనవంటి సర్వసామాన్యుడు, కేవలం ఒక పాత్రికేయుడు, ఇట్టే మొగుడైపోవడం, దైవమంతటివాడే చూస్తూ చూస్తూ వోర్చుకోలేదు. రాఘవయ్యవంటి రూపంలో ఎవడ్నో ఒకబంటుని పంపి, అడ్డుపుల్ల వెయ్యమంటాడు.

వరలక్ష్మి - అంటే; అదే - చిట్టి -




ఆ పిల్లకి తల్లిదండ్రులు పెట్టిన పేరు - దాని పినతల్లికి భర్తగా ప్రత్యక్షమయిన రాఘవయ్య, చాలా దూరాలోచనలు గలవాడు. అయితేనేం, పాపం పిల్లల్లేరు. పుట్టిన యేడాదిలోపునే తల్లిని పోగొట్టుకున్న వరలక్ష్మిని, (పుట్టిన యేడాదిలోపునే తను తండ్రిని పోగొట్టుకున్నట్టు!) భార్య ప్రోద్బలంకూడా ఉండటంవల్ల, తనే చేరదీశాడు. తల్లికూడా పోవడంతో, (తనతల్లీ పోయినట్టు!) ఆపిల్ల భవిష్యత్తు మీద సర్వాధికారాలూ తనవిగా చేసుకున్నాడు. వరలక్ష్మికి నాట్యంలో మంచిభవిష్యత్తు ఉండొచ్చునన్న సత్యాన్ని ఆ పిల్ల అయిదోయేటనే పసిగట్టగలిగినవాడతడొక్కడే! వరలక్ష్మి చేత బియ్యే ప్యాసు చేయించడమే కాకుండా, అటు భరతనాట్యంలోనూ, ఇటు కూచిపూడిలోనూ ప్రవీణురాలయేటట్టు చేయగలిగిందీ రాఘవయ్యే!

కూచిపూడిలో ఇప్పుడున్నవాళ్ళందరినీ మించిపోయే లక్షణాలు ఈ అమ్మాయిలో కనిపిస్తున్నాయంటూ బందా కనకలింగేశ్వర్రావుగారొకసారి చేసిన వ్యాఖ్య ఎక్కడో పత్రికలో చదివిన విషయం జ్ఞాపకమొచ్చింది ప్రసాదుకి.

తనూ బియ్యే పూర్తిచేసినవాడే. ఎందుకు పనికొస్తుందీ? వరలక్ష్మికి - అంటే చిట్టికి, నాట్యంలో తరిఫీదుకి కలిగినటువంటి అవకాశాలు, తనకు రచనావ్యాసంగంలో కలిగాయా మరి! దేనికైనా పెట్టిపుట్టాలిలే. నిరంజనరెడ్డి ఒక్కడున్నాడు తనపాలిటికి. అతని

ప్రోద్బలమే లేకుంటే తనీపాటికీ ఏ గుమాస్తా గిరిలోనో పడేవాడే.

"దరిద్రపు గుమాస్తాపని యేమిటోయ్. చక్కగా రాసేశక్తి ఉంది నీకు – ఉత్తరోత్తరా గొప్ప రైటర్ అయ్యే లక్షణాలు నీలో ఎన్నో ఉన్నై. చదువుకున్నావుగా!" అన్నాడొకసారి రెడ్డి. అట్లా అన్నవాడత నొక్కడే.

తను పత్రికలో చేరకముందు – ప్రసాదు అప్పుడప్పుడు ఒకటీ అరా కథలు రాశాడు. ఒకసారెప్పుడో రాజకీయాలమీదకూడా కొద్దిగా విరుచుకు పడ్డాడు.

ఏదైనా ఉద్యోగం – కనీసం గుమాస్తా – కోసం ప్రయత్నిస్తున్న రోజులవి.

"ఇక్కడి దినపత్రికవాళ్ళు మరొక రిపోర్టరుని చేర్చుకోవా లనుకుంటున్నారు – ఏదో ఇంతిస్తార్లే – ఫరవాలేదు. చేర్తావా ? ఆ పత్రిక యజమానీ, ఎడిటరూ తెలిసినవారేలే. నీ పేరు చెప్పాను," అన్నాడు రెడ్డి.

"రిపోర్టింగు నాకాటే చాతకాదే! ఇరుకులో పడ్తానేమో సుమా!" అంటూ ప్రసాదు సందేహం వ్యక్తపరిచాడు.

"అభ్యాసం కూసు విద్యా – అదేం బ్రహ్మవిద్యకాదు. నే చెప్తాగా!'' అన్నాడు రెడ్డి.

ఆ మర్నాడే తను ఈ ఉద్యోగంలో చేరింది కూడా. అన్నట్టు రెడ్డి ఇంతకీ వొచ్చాడో లేడో.

ప్రసాదు ఒకసారి యిటూ అటూ చూశాడు గాని, దూరానా ఆ మసగ చీకటిలో, ముఖాలు తెలీటం లేదు.

రాఘవయ్య చాలా గట్టివాడు. భగవంతుడి దూతలు – లేదా బంట్లు – కొన్ని ఓర్వలేని పనులకోసం అవతరించి, వాటిని అమలు జరుపుతున్నప్పటికీ, అటువంటి పనులు ధోకాలేకుండా సాగేటందుకు, తమకు తెలీకుండా కొన్ని మంచిపనులు కూడా చేస్తారు. ఏ మాట కామాటే చెప్పాలి మరి.

అయితే రాఘవయ్య అంతటితో ఊరుకునే మనిషికాడు. ఏ నోటికైనా సరే సరిగా పలక తగ్గదిగా, ఒకసారి వింటే జ్ఞాపకముండి పోయేటట్టుగా ఉండాలని, ఆ పిల్ల పేరు కూడా 'వసంత'గా మార్చివేశాడు. అయితేనేం, చిట్టి అనే ముద్దుపేరులో ఉన్న మాధుర్యం, ఒకవిధమైన గుబాళింపు, ఒకసొగసు, ఒకానొక నాజూకు, ఒక ఆప్యాయత, ఆ పిల్లను వసంతగా ఊహించుకోవటంలో ఎన్నటికీ ఉండదు ప్రసాదుకి.

దాన్ని మొదలెట్టి చాలా సేపయినట్టుంది. పక్కనే ఉన్న ఒకపాటి పరిచయస్థుణ్ణి కదిలించాడు ప్రసాదు.

''టైమెంత ?''

"అయిదు నిమిషాలుంది ఎనిమిదికి."

ప్రసాదు చేతికి గడియారంకూడా లేకపోవడం అన్యాయమే. ఈ మహా పట్నంలో రకరకాల చీట్లున్నాయి. రేడియోలూ, సైకిళ్లు, బీరువాలూ, రిస్టువాచీలూ, ఇంకా పోతే స్కూటర్లు, ఆడవాళ్ళకయితే, చీరలూ, స్టెయిన్ లెస్ స్టీలు సరుకులూ, అన్నింటికీ చీట్లు. అద్దె కొనుగోలులో ఇదో పద్ధతి. తతిమ్మా వాటిసంగతి, రాఘవయ్యగా రనే దూతగారి బాస్ అయిన దేము డెరుగు. కనీసం, ఈసారి రిస్టువాచీ కైనా ఒక చిట్ తీసుకోవాలి అనుకు న్నాడు ప్రసాద్, రెడ్డితో మాట్లాడాలి.

స్టేజిపైన కొత్త 'అయిటమ్' ప్రారంభ మయింది.

రంగనాయిక!

మోహనరాగవర్ణం.

చిట్టి అభినయిస్తున్నది భరతనాట్య పద్ధతిలో.

అచ్చంగా రంగనాయిక ఇలానే ఉండే ఉండాలి.

"ఆ రోజుల్లో ఆమె అనుగ్రహం పొందినవా రెంత అదృష్టవంతులు!" అనుకున్నాడు ప్రసాద్.

ఈ వర్ణం ముగిశాక ఇంటర్వల్ ఉంటుంది. బయటకుపోయి రెడ్డికోసం గాలించాలి వొచ్చాడో లేడో. రాకుండా ఉండడు. ఏం పనితగిలిందో! సిగరెట్టు కాల్చాలి. ప్రసాదు జేబు తడుముకున్నాడు. అగ్గిపెట్టె మటుకే ఉంది. ఆఖరి సిగరెట్టు, హాలులోకి రాకముందే కాల్చివేసిన సంగతి జ్ఞాపక మొచ్చింది. బయట దొరుకుతె- కొనాలి.

మర్నాటి పత్రికలో మంచిరిపోర్టు రాయటానికి పనికొచ్చేలాగా, స్టేజిలో నికి – అంటే గ్రీన్ రూంలోనికి పోయి, చిట్టిని – అనగా 'వసంత'ను పలక రిస్తే? ఇంటర్వ్యూ!!

చిన్నతనంనుంచీ తను ఎరిగిన, నిజా నికి తన కీపాటికి భార్య కావలసిన చిట్టితో ఇంటర్వ్యూ!

రెడ్డితో కన్సల్టు చేయాలి.

ఎంత విచిత్రమైన అనుభవం అది!

అది సరేగాని, అంతా అనుకున్నట్టే జరిగి, చిట్టి తనకు భార్యే అయివుంటే, నాట్యంలో యీపాటికంత పేరు వచ్చేదా? ఏం? ఎందుకు రాకూ డదూ? ఆ పిల్లతోపాటు తనకూ పేరు ప్రతిష్ఠలు వచ్చేవేమో!

చిట్టి – ఎంత అందమైన విగ్రహం! వర్ణంలో స్వరం వేస్తున్నప్పుడు చిట్టి రొమ్ముల కదలిక పిచ్చెత్తించింది ప్రసాదుకి.

తనకోసం ఆ స్వరం మరొక్కసారి వెయ్యరాదా? అనుకున్న ప్రకారం ఆ పిల్లతో తనకు పెళ్ళయి ఉంటే, ఏకాంతంగా, ఎన్నిసార్లు అదేస్వరం వేయించుకొని, ఆ కదలికలు తనివి తీరా ఆనందించేవాడో!

ఎంత తీర్చిదిద్దిన విగ్రహం! అందుకే మరి, నాట్యంలో అంతగా రాణిస్తున్నది!

పారిస్ నుంచి, లండననుంచి, అమెరికానుంచి పిలుపులు !

కొద్ది రోజులలోనే చిట్టి, అంటే, వసంత అనే పేరుతో బ్రహ్మాండమైన పబ్లిసిటీ అందుకుంటున్న చిట్టి, విదేశ పర్యటనకై బయల్దేరవలసి వుందని విని ఉన్నాడు ప్రసాదు. ఆ పర్యటనకు ముందు, కొన్ని పెద్దపట్నాలలో ఆహూతుల సమక్షంలో, వీడ్కోలు ప్రదర్శనాల వంటి విది.

పదిపన్నెం డేళ్ళకిందట, తనకు పదకొండో, పన్నెండో – ఏడెనిమి దేళ్ళ చిట్టి, పరికిణీతో, జాకెట్టుతో, గిరగిరా తిరిగితే, అప్పటికే తనతెలిసీ తెలీనికళ్ళు చెదిరేవనిపించేది. ముఖ్యంగా ప్రసాదుకి, ఆ పిల్లకళ్ళల్లో ఆకర్షణ అంతా ఉందనిపించింది. అప్పటికీ, ఇప్పటికీ, అవేకళ్ళు !

"దాని అదృష్టమంతా కళ్ళల్లోనే ఉందిరా!'' అనేది ప్రసాదుతో, వాళ్ళమ్మ బతికున్నప్పుడు.

"అమ్మే బతికుంటే, చిట్టి డాన్సు చూసి, ఎంత మురిసేదో!" అనుకున్నాడు ప్రసాదు.

స్వరంతో వొళ్ళంతా జలదరిస్తూ, తనవొళ్ళే జలదరింప చేస్తున్నది చిట్టి. ఆమె శరీరంలో వొంపులన్నీకూడా అవేస్వరాలు పలుకుతున్నాయి. నడ్డిమీద చేతులు ఆన్చి, భుజాలు కదిలిస్తున్నప్పుడు, రొమ్ములు పరస్పరం ఆటలాడుకుంటున్నై.

చిట్టి ఎంత పెరిగింది!

ప్రసాదుకి వొళ్ళంతా కళ్ళుంటే ఎంత బాగుంటుం దనిపించింది.

ఇవాళ్ళ చిట్టి, ఎప్పటికన్నా గొప్ప 'ఫారమ్'లో ఉందనిపించింది.

తననే గమనించి 'ఫారమ్'లోనికొచ్చిందో!

ఏమిటో పిచ్చి తనకు !

నిజంగా అమ్మే ఉంటే ఎంత ఆనందించేది! అసలు అమ్మే ఉంటే చిట్టి తన కింత దూరమవుతుందా? అమ్మ మటుకు ఏం చేయగలదని? అప్పుడప్పుడు అమ్మకు ఏదో దిగు లొచ్చి, 'నీ అదృష్ట మెలా ఉందో నాయనా!' అనేది !

తన అదృష్టం, యిట్లా 'పాత్రికేయం'గా ఉండబోతుందని ఆ తల్లికి ఏనాడో తెలిసే ఉండాలి!

ఒక పాత్రికేయునికి. ఒక భరత నాట్యప్రవీణురాలు పెళ్ళామౌతుందా! కల్లోమాట!

ఆ రోజుల్లో అయితే, చిట్టితో మాట్లాడని ఘడియ ఉండేదికాదు. ఆ పిల్లకు తనమీద బాగా మనసుందని, తనకు రకరకాలుగా తెలుస్తూనే




ఉండేది. అప్పటివన్నీ మరీ చిన్నతనపు మాటలు!

"ఏమే–నన్ను పెళ్ళాడతావులే ?"

"ఎందు కాడనూ?"

"మరి నువ్వు డాన్సు చేస్తూనే ఉంటావా?"

"ఎందుకు చేయనూ? ఏం? నీకు బాగుండదా ?"

'నీకు బాగులేకపోతే మానేస్తాలే' అని కాబోలు భావం !

"ఎందుకు బాగుండలా! నువెప్పుడూ డాన్సు చేస్తూనే ఉండాలి మరి!"

'నన్ను చేసుకుంటే నీ డాన్సుకేమీ అడ్డురాను' అని తనభావం !

చిన్నపిల్లల మాటలలోకూడా, ఏదోభావం ఉండనే ఉంటుంది. ఆ భావం చిన్నపిల్లలకు కూడా స్ఫురిస్తుంది!

"మరి నువేం చేస్తావుట?" భవిష్యత్తు గురించి అప్పుడే ఆలోచన!

"నేనేదైనా పెద్దవుద్యోగం చేస్తూ ఉండనా? నువు చెయ్యొద్దంటే చేయనేమో మరి!"

'నువు నాకు ఎంతచెపితే అంత' అని కాబోలు తనభావం!

ఇల్లాంటి 'అర్థంలేని' డైలాగులు, సాగుతూనే ఉండేవి. ఏమంతగా జ్ఞాపకం లేవు ఇప్పుడు. అయినా, ఆ పిల్ల మనసు తనమీదే ఉందని, ఎవరో హామీ యిచ్చినట్టుగా నమ్మకం ఏర్పడిపోయింది ప్రసాదుకి. కాని, ఏనాడైతే తల్లి గతించిందో ఆ క్షణం నుంచే చిట్టి కూడా తనకు దూరమైపోతున్నదని

అనిపించింది తనకు. అందుకు తగ్గట్టుగానే చిట్టి, డాన్సులో, పెద్దపెద్ద పాత్రాలలో పడ్డప్పట్నుంచీ, ఈనాటి వరకూ తాను ఆ పిల్లను కలుసుకున్న అవకాశాలు వేళ్లపైనే లెక్కపెట్ట వచ్చు.

చదువు పూర్తయిం దనిపించుకునే దాకా, ఆ ఇంట్లో తను ఎట్లా గడిపిందీ భగవంతుడి కెరుక. రెడ్డి ధర్మమా అంటూ ఈ రిపోర్టరు పని దొరకడమే వ్యవధిగా, ప్రసాదు వేరయిపోకనూ తప్పలేదు.

స్టేజిపైన హఠాత్తుగా తెరపడింది హోలులో లైట్లన్నీ వెలిగినై. మైకులో ఎవరో అన్నారు—పదినిమిషాలు ఇంటర్వల్.

ప్రసాదు గబగబా జనాన్ని తోసుకుంటూ బయటకు వచ్చాడు. ఎక్కడా రెడ్డి కనపడలేదు. టీ కాఫీలు అమ్మే చోట జనం మరీ ఎక్కువగా ఉన్నారు. టీకోసం ప్రసాదు జనాన్ని తోసుకుంటూ ముందుకు వెళ్ళబోయినాడు.

"హాల్లో ప్రసాద్!"

"వోర్నీ—ఎంత వెతికినా కనపడ్డావు కాదు! ఎక్కడా?" అన్నాడు ప్రసాదు.

"ఈ కప్పు పుచ్చుకో. మరొటి తెస్తాను."

ప్రసాదు కప్పు పుచ్చుకొని బయట పడ్డాడు.

"మాంఛి రైటప్ రాసేట్టున్నావే, నీ వాలకం చూస్తే! ఏం?"

ప్రసాదు నోటినుంచి కప్పుతీస్తూ చిరునవ్వు నవ్వాడు.

"ఎక్కడ కూర్చున్నావ్? నీకోసం చాలా వెతికాను!"

"అయిదింటికి ఒక ప్రముఖ నటుడు అర్జంటుగా ఆఫీసుకే ఫోనుచేసి, ఉన్న పాళంగా స్టూడియోకి రమ్మన్నాడు. అక్కడనుంచి వచ్చేసరికి ఏడున్నరయింది. వెన కెక్కడో ఇరికాను."

"ఏం కథ?"

"ఏం లే. వాళ్ళు తీస్తున్న పిక్చరు ఆఖరి షూటింగ్. అప్పటికప్పు డనుకొని పార్టీ యిచ్చారు. పిలుపులన్నీ ఫోను మీదనే. ప్రముఖ నటులిద్ద రున్నారు. వాళ్ళలో వాళ్ళకు ఏం పాలిటిక్సున్నా ఇద్దరూ మరి నా క్కావలసినవారే! వెళ్ళక తప్పలే. ఏమంటావు? నిన్ను కూడా తీసుకుపోదా మనుకొని, మీ ఆఫీసుకి ఫోనుచేస్తే, నువు అప్పుడే వెళ్ళిపోయావన్నారు. పోతూ తోవలో ఇక్కడ చూశాను. లేవు. లైట్ మైపోతోందని పోయినాను."

"పిక్చరు గురించి రాస్తున్నావా?"

"మరి రాయొద్దా! పత్రిక నింపాలి కద! దానికేం గాని, ఇవాళ మాంఛి 'ఫారమ్'లో ఉన్నట్టుం దీవిడ! త్వరలోనే అమెరికా వెళ్తున్నదటగా!"

"అనుకుంటాను!" అన్నాడు ప్రసాదు.



"అందులో నువు కనిపించావను కుంటాను!"

"ఎట్లా కనిపిస్తాను? కనిపిస్తేనేం?"

"మాంచి ఫారమ్!"

"నువ్వొకడివి. నాకన్నా పిచ్చి వూహలు! ఇదేమన్నా సినిమా కథ అనుకున్నావా?"

"సినీమా కథ లెక్కడా జరగవు. ఇట్లా జరిగేవి సినీమా కథలకు ఏమీ పనికిరావు! నీకు తెలీదా ఏమిటి?"

రెడ్డికి మాటల్లో చమత్కారమూ, రాతలో చమత్కారమూ కూడా ఉన్నాయి. చాలామంది కన్న బాగా రాస్తాడు అతని విమర్శలన్నా వ్యాసాలన్నా ప్రసాదుకి ఇష్టం కూడా. కాని, ఏం రాస్తే ఈ రోజుల్లో ఎవడికా

వాలి? ఖుక్తి గడవటం తనవంటి వాడికి ప్రధానం; రెడ్డికి కాకపోయినా. ఎవడు చూసొచ్చాడు రేప్రొద్దున్న అమాంతంగా ఒక సినీ రచయితే అయిపోవచ్చు రెడ్డి. అయినవాళ్ళంతా ఇతనికన్న ఊడబొడిచారా; ఆ మాట కొస్తే తను?

"ఈమె సినీమాలలో కూడా డాన్సు చేస్తే బోలెడంత భవిష్యత్తుందని రాయ బోతున్నావల్లే ఉన్నదే!" అన్నాడు ప్రసాదు.

"ఏం తప్పా? నీ కట్లా అనిపించ లేదా?"

"తప్పనటం లేదు. అల్లా నే రాయమంటున్నాను. నాగేశ్వర్రావు దగ్గర అప్పుడే ఒకమాట వేసేవుంటా వీపాటికి!"

"ఆ పని నిన్నడిగి చేద్దామనుకుం టున్నాను. అది సరేగాని, ఈ పిల్ల నీ మేనమామగారి కూతురే కదా..."

"కాదన్నానా?"

"మంచి అవకాశం జారవిడుచు కుంటున్నా వనుకుంటున్నాను–"

"ఏదో శాస్త్రం చెప్పిన తర వాయిగా ఉంది. సిగరెట్టివ్వు." ఇద్దరూ సిగరెట్లు ముట్టించుకున్నారు.

"అవున్లే, అదీ నిజమే. ఆమెకు మేనేజరుగా రున్నారుగా – నాకంతా తెలుసులెద్దూ!"

రెడ్డి కంతా తెలుసు. తానే చాలా వరకూ ఏదో మాటలో మాటొచ్చి చెప్పా డొకసారి.

"సరేగాని, లోనికిపోయి ఒకసారి ఆమెను కలుద్దామా?"

"చూ ద్దాం పద," అన్నాడు ప్రసాదు.

గ్రీన్ రూం అంతా జనంతో నిండి ఉంది. ఇద్దరూ తోసుకుంటూ లోనికి వచ్చారు.

చిట్టి స్టేజిపైన వివిధభంగిమలలో పోజు లిస్తూ ఉండడం గమనించాడు ప్రసాదు.

చుట్టూ నలుగు రైదుగురు ఫొటో గ్రాఫర్లు, అన్నీ అమర్చుకొని సిద్ధంగా ఉన్నారు. వారిలో ఒకడు విదేశీయు డల్లే ఉన్నాడు. ఒక్కొక్క రే ఒక్కొక్క కోణంనుంచి కళ్లు జిగేలు మనిపించేటట్టు, ఫ్లాష్‌లు కొడుతూ ఫొటోలు తీస్తున్నారు.

"అవతలివాడు – నాలుగు కేమే రాలు–చూడు, 'లైఫ్' ఫొటోగ్రాఫరు. ఇదివరకు నువ్వు చూడలే దనుకుంటాను. మొన్నొకసారి స్టూడియోలకొస్తే తెలి సింది."

"'లైఫ్'లోకూడా ఫొటోలు పడ్తా యన్నమాట!" అన్నాడు. ప్రసాదు కొద్దిగా ఆశ్చర్యపోతూ.

తరవాత ఒకగ్రూప్ ఫొటో ఏర్పా టయింది. చిట్టీ, రాఘవయ్యా, వా రిద్దరిమధ్య ప్రసాదుకి తెలీని మరొక వ్యక్తీ.



"ఇక నేం!" అన్నాడు రెడ్డి.

"అంటే?"

"నే ననుకున్నదే. ఆ మధ్య చూడు. అతని గురించి నా కెందు కో అనుమానం కలిగిందిహ్మా! నీతో చెప్ప లేదు. తరవాత చెప్తా," అన్నాడు రెడ్డి.

రెడ్డి, ఆవులిస్తే, కొన్ని పేగులైనా లెక్క పెట్టగలడు. తనకింకా ఆ మాత్రం కూడా చాతకాలేదు. ఏదీ, ఆర్నెల్లే కదా పత్రికానుభవం!

ఫొటోలు తీయడం అయింది.

ప్రసాదు చిట్టిని సమీపించాడు. పక్కనే రెడ్డికూడా ఉన్నాడు.

'రంగనాయిక' వంట మేకప్‌లో చిట్టి ధగధగ మెరిసిపోతున్నది.

"చిట్టీ!"

"వొచ్చావా బావా?"

చిట్టి ఒక్కసారి గతుక్కు మన్నట్టనిపించింది ప్రసాదుకి. అంతలోనే ఆమె కళ్ళల్లో తనకు మాటలతో చెప్పటానికి వీలుపడని దైన్యం కనిపించింది.

"ఇవాళ చాలా బాగా చేశావుచిట్టీ! అది చెప్పటానికే వొచ్చాను!" అన్నాడు ప్రసాదు.

"నిన్ను గమనించాను!" అన్నది చిట్టి.

"ఇతను రెడ్డి – నిరంజనరెడ్డి. నా స్నేహితుడు. సినీమాపత్రిక ప్రతినిధి."

"నమస్కారం."

"మీ రివాళ గొప్ప 'ఫారమ్'లో ఉన్నారు. ఎప్పుడు వెళ్ళడం ఫారిన్?" అన్నాడు రెడ్డి.

చిట్టి, ఒకనిమిషం మౌనంగా ఉంది. సమాధానం ఇచ్చేలోపున రాఘవయ్య గారు ముందు కొచ్చారు. ప్రసాదుని చూసీచూడనట్టుగా నటించి –

"ఏదీ, కొద్దిరోజులలోనే ఫైనలై పోతుందిలెండి," అన్నాడు.

ప్రసాదు ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు రెడ్డి ఆ నిట్టూర్పు గమనించాడు.

"మీతో ఒకముఖ్యమైన విషయం మాట్లాడాలి... మీ డాన్సు విషయమే ననుకోండి. రేపు రావొచ్చా?"

"తప్పక. ముందు ఫోను చేయండి. అమ్మాయ్, పద. లై మైంది!"

"నువుకూడా రారాదా బావా! చాలాకాల మయిందిగా?" అన్నది చిట్టి పోతూపోతూ.

"ఇద్దరం ఒస్తాం," అన్నాడు రెడ్డి.

డాన్సు ఉత్తరార్థంలో ప్రసాదూ, రెడ్డి పక్కపక్కనే కూర్చున్నారు. కాని ఈసారి వారిద్దరిదృష్టి డాన్సు మీద ఆ లేదు.

"ఫొటో తీయించుకోడానికి ఆ అమ్మాయి పక్కనే నిలబడ్డవాడు గుర్తుందా? ఫారిన్ ట్రిప్ స్పోన్సార్ చేసి, మెల్లగా ఇక్కడినుంచి దాటించి, అమెరికాకు పట్టుకుపోయి, అక్కడ ఆమెతోసహా సెటిల్ అయి పోదా మనుకుంటున్నాడు. తెలీకుండా ఉండి పోతాయా?" అన్నాడు రెడ్డి.

ప్రసాదు అయోమయంగా చూశాడు.

"నీ కెట్లా తెలిసింది?" అన్నాడు.

"పత్రికలో పని చేస్తున్నావు – ఆపాటి కూపీ లాగలేవా? నే న్లాగే శాను."

"ఎట్లా?"

"ఆమధ్య సారథిలో, ఏదో ముహూర్తపు షూటింగు–ఆలూ చూలూ లేని కథ–అంటే పేరు పెట్టలేదు. అక్కడ పార్టీకి పోతే, ఈ పెద్దమనిషున్నాడు; బాగా డబ్బుతో మదించిన వాడట. ఫిల్ము తీయటానికి కొంత డబ్బుకూడా యిచ్చాడంటారు. అమెరికా వాసి. ఎప్పుడో పోయి అక్కడే డాలర్ల తయారీలో వుండిపోయినాడు – మాట్లాడాల్లే పది నిమిషాలపాటు. అక్కడుండవలసిన శాల్త్రీ. మొత్తానికి మీ రాఘవయ్య గట్టివాడు. ఉద్దండుడల్లే ఉన్నాడు. ఇత




గాణ్ణి పట్టేశాడు. వసంత వుందిగా! ఆ పిల్లమీద కన్ను పడింది వీడికి. ఇక మిగతా కథ ఎవరూ చెప్పనక్కర్లేదుగా!" అన్నాడు రెడ్డి.

"కథ చాలా దూరం వెళ్లిందే!" అన్నాడు ప్రసాదు ఏదీ పాలుపోని స్థితిలో పడి.

"నీ కింకా ఆ పిల్లమీద ఆశ మిగిలి వున్నట్టుందే !"

"ఆశల కేం? ఆకాశా లంటుతై. తీరొద్దూ?" అన్నాడు ప్రసాదు. ప్రసాదు మాటలలో రెడ్డికి ఊహించలేనంత జాలి కనిపించింది.

"కాని, చాలా అన్యాయంలే. చూద్దాం; ఏమవుతుందో!"

"ఏమిటి చూసేది?"

"డాన్సు చూడు. తరవాత మాట్లాడదాం," అన్నాడు రెడ్డి.

తొమ్మిదిన్నరకు డాన్సు అయ్యిపోయింది.

"నేను చాలా దురదృష్టవంతుణ్ణి. అయినా నాలో ఏం చూసుకుని అత్యాశలకు పోయేది?" అన్నాడు ప్రసాదు.

"ఇంకొకటికూడా జరిగింది. నాగేశ్వరావుగారు ఈ పిల్లని చూశారు. తమ పిక్చరులో డాన్సుకి బుక్ చేస్తామన్నారు. ఆ పిల్ల సరే అంది. కాని పేచీవచ్చింది."

"నువు నాకన్నీ కొత్తకొత్త విషయాలు చెపుతున్నావు!"

"ఒక సంవత్సరానికి కాంట్రాక్టు రాయమన్నారు. అతగాడున్నాడే - అడ్డుపుల్ల వేశాడు, అమెరికా వెళ్లిపోవటానికి-అంటే 'ఫారిన్ టూర్' పేరుతో ఆటంకం కలుగుతుందని గ్రహించాడు. అతను వొప్పుకోలేదు. మీ రాఘవయ్య

కూడా వొప్పుకోలేదు. న్యాయమే కదా!''

ఇద్దరూ రోడ్డుమీది కొచ్చారు.

''ఈ రాత్రికి నా గది కొచ్చేయి,'' అన్నాడు ప్రసాద్.

''వొచ్చేద్దును. కాని తెల్లారగానే వేరే పనుంది; రేపొస్తా,'' అంటూ రెడ్డి వెళ్ళిపోయాడు.

ప్రసాదు హోటల్‌కి పోయి ఇంత తిని, తన గదికి బయల్దేరాడు.

ఆదర్శనగర్‌లో ఒక మేడమీద కేటాయింపుగా ఉన్న ముందుగది అద్దెకు తీసుకొని ఉంటున్న ప్రసాదుకి ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు. రెడ్డి ఎంతకేనా తగినవాడు. మర్నాడు చిట్టిని కలుస్తా మనటంలో అతని ఉద్దేశ మేమిటోకూడా ప్రసాదుకి తట్టలేదు.

ఏది ఎట్లా ఉన్నా, ప్రసాదుకి ఇంకా ఆ క్షణం వరకూ చిట్టిపైన ఆశపోలేని మాట నిజమే. తన చేయి ఏనాడో జారిపోయింది. అదీ నిజమే. రెడ్డి చెప్పినట్లు, ఆ పిల్ల, వా డెవడో – వాడితోసహా విదేశాలకంటూ పోయి తిరిగి రానంతవరకూ ఈ ఆశ పీకుతూనే ఉంటుంది. చిట్టికి మట్టుకు ఇట్లానే ఉండదా? ఉండకపోవడం, ఎందుకో అసంభవం అనిపించింది తనకు. ఆ పిల్ల మనసు తనకు చిన్న తనంనుంచీ తెలుసు. అవకాశం దొర కాలిగాని, తెగింపు ఉండదా?

మర్నాడు సాయంకాలం అయిదింటిదాకా రెడ్డి పత్తాలేదు. ప్రసాదుకి అయిదు దాటాక ఆఫీసుకి ఫోన్ ఒచ్చింది –

''వెంటనే గోపీహోటల్‌కి రా, నీ కోసం ఎదురుచూస్తున్నా,'' అని. ఫోను పెట్టేశాడు రెడ్డి. గోపీలో కాఫీ పుచ్చుకుంటూ రెడ్డి చెప్పాడు.

''ఈ వేళంతా నాకు నీ విషయంలోనే పని!''

''నా విషయంలోనా?'' అన్నాడు ప్రసాదు ఆశ్చర్యపోతూ.

''చెప్తా విను. మధ్యాహ్నం వాళ్ళింటి కెళ్ళాను – మీ రాఘవయ్యగారింటికి. నిజానికి రాఘవయ్యగారితోనే మాట్లాడాలని వెళ్ళాను, వసంత ఫిల్మ్ కాంట్రాక్టు గురించి నచ్చ చెప్పటానికి. అదృష్టవశాత్తు ఆయన లేదు. వసంతా, ఆమె పిన్నీ ఉన్నారు. మాటల్లో పెట్టేశాను; పసికట్టాను. అవిడకు ఆ పిల్లమీదే ఉన్నాయి పంచప్రాణాలూ. విదేశాలకు పోవడం ఇద్దరికీ యిష్టం లేదని తెలిసిపోయింది. అమ్మాయికి మైనారిటీ ఎప్పుడో తీరింది గనక కాంట్రాక్టుపైన సంతకం పెడితే, ఆ బెడద తప్పుతుందన్నాను. ఆ పిల్లకు ఎంత ధైర్య మొచ్చిందను కున్నావు! వెంటనే సంతకం పెట్టింది!''

''కాంట్రాక్టు ఫారా లెక్కడివి?'' అన్నాడు ప్రసాదు ఆశ్చర్యపోతూ.

"నాగేశ్వర్రావుగారు ఇచ్చారు. అంటే నేనే లాక్కొచ్చాను. నీ ఉద్దేశం నాదీ! ఇక విదేశయాత్ర సున్నా. ఆ రాఘవయ్య లబోదిబో మంటాడు. ఇక పోతే, ఆ రాఘవయ్యా, అమెరికా వాసీ, ఇంకా కొందరూ 'త్రీ ఏసెస్' లో మాంచి పట్టులో ఉన్నారు. బహుశా రాత్రికిగాని రారు. నాకు తెలిసిన టాక్సీ ఒకటి మాట్లాడి ఉంచాను; చెప్తాలే. రేపు తెల్లవారు జాము మూడింటికి రడీగా ఉండు; నే నొస్తాను. పదిరోజుల శలవు రాసి పడేయి."

"నా కంతా అయోమయంగా ఉందిలే."

"అయోమయంగానే ఉంటుంది నీ స్థితిలో. నే చెప్పినది మరచిపోకు. అదృష్టం తన్నుకొస్తోంది పో," అన్నాడు రెడ్డి.

ప్రసాదుకి రాత్రి నిద్ర లేదు. గంటలు లెక్క పెడ్తున్నాడు. ఒంటి గంట, రెండు, మూడు...

టాక్సీ ఆగిన చప్పుడయింది.

"సిద్ధంగా ఉన్నావా?" అన్నాడు రెడ్డి గదిలో కొస్తూ.

"పద" అన్నాడు ప్రసాదు.

ఇద్దరూ టాక్సీ ఎక్కారు. పది నిమిషాలలో రాఘవయ్యగారింటిముందాగింది టాక్సీ.

రెడ్డి దిగి లోనికి వెళ్ళాడు. అయిదు నిమిషాలలో తిరిగొచ్చాడు. వెనకనే చిట్టి - ఆ వెనక ఆమె పిన్ని!

చిట్టి టాక్సీ ఎక్కింది. ప్రసాదు పక్కనే కూర్చున్నది. రెడ్డి ముందు సీట్లో డ్రైవరు పక్కనే కూర్చున్నాడు.

"సుఖంగా వెళ్ళిరండి నాయనా! మీ రేమీ బెంగ పడకండి. నే చూసుకుంటాను," అన్నది చిట్టి పిన్ని.

టాక్సీ కదిలింది.

"ఏం బావా!" అన్నది చిట్టి.

"ఎక్కడికి పోతున్నాం?" అన్నాడు ప్రసాదు.

"విజయవాడ. ఆ తరవాత వీలుంటే మద్రాసొకసారి."

* * *

"స్వయంగా రాజుచేత గజారోహణ చేయించుకున్న తంగిరాల శంకరప్పకి తోడుగా, వెంటనే వింజామర చేత పుచ్చుకొని 'రంగనాయిక' కూడా ఏనుగెక్కేసింది."

---

మహేశ్పూర్ గ్రామస్థుడైన హరమోహనదత్తుడి పెద్దకుమార్తె ఇందిరను మోహన్పూర్‌కు చెందిన ఉపేంద్రుడి కిచ్చి పెళ్ళిచేశారు. పెళ్ళినాటికి ఇందిరకు పదకొండో ఏడు. కాని ఎనిమిదేళ్ళపాటు ఇందిర కాపరానికి వెళ్ళలేదు.

కారణమేమంటే హరమోహనబాబు గొప్ప సంపన్నుడు. ఆయన అల్లుడు ధనికుడు కాడు.

"నా కూతురు అత్తవారిరిటిక్కి వెళ్ళేది అడవాచాకిరీ చెయ్యటానికా ? నా అల్లుడు సంపాదించటం నేర్చుకున్నాకనే కూతుర్ని పంపుతాను," అన్నాడు హరమోహనుడు.

ఈమాట తెలిసి ఉపేంద్రుడికి పౌరుషం వచ్చింది. ఆతను కాలినడకన, కట్టుబట్టలతో పంజాబు వెళ్ళి, ఏడెనిమిది ఏళ్ళపాటు రెండుచేతులా డబ్బు గడించి, ఆ తరవాత తిరిగివచ్చాడు.

ఇందిరను అత్తవారింటికి తీసుకుపోవటానికి మోహన్పూరు నుంచి మేనా వచ్చింది. అందులో పట్టుపరు వున్నది. పల్లకివెంట వచ్చిన దాసీలు పట్టుబట్టలు కట్టుకునిఉన్నారు. వాళ్ళు చాలామంది ఉన్నారు.

అల్లుడు సంపన్నుడయాడని హరమోహనుడు తృప్తిపడి, ఇందిర అత్తవారింటికి వెళ్ళటానికి ఆయన అనుమతించాడు.

ఇందిర తన భర్తదగ్గిరికి పోవటానికి చాలాకాలంగా తహతహలాడుతున్నది. తనభర్త చాలా అందగాడని ఆమె పెళ్ళినాడే చూసింది. తన తల్లిదండ్రులు తన సుఖానికీ డబ్బుకూ లంకెపెట్టటం ఆమె కేమాత్రమూ ఇష్టంలేదు.

ఇంత కాలానికి ఆమెకోరిక ఈడేరుతున్నది. తనచెల్లెలు కామిని, "అత్తగారి ఇల్లు ఎట్లాఉంటుదో నీకు తెలీదుగాదూ?" అని అంటే, ఇందిర, "నాకు తెలుసు. అది స్వర్గం. అక్కడ మన్మథుడు విహరిస్తూ సుఖాలు వెదజల్లుతాడు. కోయిలలు అస్తమానమూ కూస్తూ ఉంటాయి. అమావాస్యనాడుకూడా వెన్నెల కాస్తుంది," అన్నది.

ఇందిర పుట్టింటినుంచి అత్తవారింటికి పదికోసులదూరం; ఆరుగంటల ప్రయాణం. చీకటి పడకుండానే చేరితే తన భర్తను తనివితీరా చూసుకోవచ్చునని ఇందిర ఆరాటము. కాని ఇందిరకు తల్లిపెట్టిన సారె చాలా జాస్తికావటంచేత మేనా చురుకుగా నడవటం లేదు.

మేనా "కాలాదీఘీ" సరస్సు చేరేసరికి అపరాహ్నం రెండున్నర అయింది.

అది చాలా అందమైన ప్రదేశం. భయంకరమైన ప్రదేశంకూడానూ. సరస్సు ఒడ్డువెంబడి దారికి రెండువైపులా పెద్దపెద్ద మర్రిచెట్లున్నాయి; అక్కడ దొంగల భయం జాస్తి. సరస్సుకు దగ్గరలోనే కాలాదీఘీ గ్రామం ఉన్నది. ఆ ప్రాంతాల వ్యాపారం చేసుకునేవాళ్ళుకూడా దొంగలకు మద్దతుగా ఉంటారని చెప్పుకునేవారు.

సరస్సు ఒడ్డున చెట్లనీడలో మేనాను దింపి, బోయీలూ, దాసదాసీజనమూ దూరంగా కూర్చుని భోజనాలకు ఉపక్రమించారు. అందరూ సరస్సులో దిగి స్నానాలు చేస్తున్నారు. అత్తవారింటికి వెళ్ళే కొత్తకోడలు కావటంతో ఇందిర మేనాలోనే ఉండిపోయింది.

ఇందిర మేనాతలుపు కొంచెంగా తెరిచి మనుషులనూ, సరస్సునూ, చెట్లనూ, ఆకాశాన్నీ చూస్తూండగా, దగ్గరలోకి ఒక నల్లని ఆకారం వచ్చింది. ఆమె భయపడి తలుపు మూసేసింది. మరుక్షణం ఎవరో మనుషులు మేనాను అమాంతంగా ఎత్తుకుని, అతి వేగంగా పరిగెత్త నారంభించారు. దూరంనుంచి మేనా బోయీలు కేకలుపెట్టటంకూడా ఇందిర విన్నది.

తాను దొంగలకు చిక్కినట్టు తెలియగానే ఇందిర మేనా తలుపులు రెండుపక్కలవీ పూర్తిగా తెరిచేసి, తన మనుషులు మేనా వెనకగా పరిగెత్తుకుంటూ వస్తూండటం చూసింది. కాని వాళ్ళు ఏమీ చెయ్యలేకపోయారు. ఎందుచేతనంటే మరి కొందరు దొంగలు మర్రిచెట్లమీదినుంచి ఊడలు పట్టుకుని జారి దిగి, మేనా వెంట ఉన్న మనుషులను అటకాయించి, లాఠీలతోనూ, బరిసెలతోనూ యుద్ధం సాగించారు.

ఒకదొంగ మేనాలోకి తొంగిచూసి, "కిందికి దూకావంటే చంపేస్తాను," అని ఇందిరకు హెచ్చరించాడు.

దొంగలా మేనాను అలా అర్ధరాత్రిదాటినదాకా మోస్తూ తీసుకుపోయి, ఒక అరణ్యప్రాంతంలో దించారు. కటికచీకటి. ఒకదొంగ కాగడాతో ఇందిర దగ్గిరికి వచ్చి, ఆమె ఒంటిమీద ఉన్నవన్నీ ఊడ్చిఇయ్యమని ఆజ్ఞాపించాడు. ఆమె కట్టుకున్న చీరెనుసైతం వాళ్ళు తీసేసుకుని ఆమె కొక చాలీచాలని పాతబట్ట ఇచ్చారు. మేనాకున్న అలంకారాలన్నీ ఊడదీసేసి, దొంగలు తమ దోపిడీఅంతా మూటలు కట్టుకుని, ఇందిరను అడవిమృగాలకు వదిలేసి పారిపోయారు.

ఇందిర వాళ్ళ వెంటబడి, "మీకు పుణ్యం ఉంటుంది, నన్నుకూడా మీ వెంట తీసుకుపోండి," అని దొంగలను బతిమాలింది.

ఒక ముసలిదొంగ, "ఈ పాటికి ఈ దొంగతనం గురించి అచోకీ ప్రారంభ



మయే ఉంటుంది. నీవంటి అందమైన పిల్లను వెంట తీసుకుపోయి ఎక్కడ దాచ గలం!" అని మంచిగా అన్నాడు.

ఒక యువకుడుమాత్రం ఇందిరను తనవెంట తీసుకుపోవటానికి ఆత్రపడ్డాడు. ముసలివాడు వాడిమీద కత్రఎత్తి, "పాపిష్టివాడా, తల పగులుతుంది జాగ్రత్త!" అన్నాడు.

దొంగలు పారిపోయారు.

తాను కన్న కలలూ, నిర్మించుకున్న ఆశా సుఖ సౌధాలూ ఒక్కసారిగా కూలి పోవటమేకాకుండా ఎవరికీ సంభవించని విపత్తు ఇందిరను చుట్టుకున్నది. ఆమె చాలా సేపు ఏడుస్తూ అక్కడే ఉండిపోయింది. ఈ దుఃఖంలో ఆమె కొక కొత్త ఆశ కలిగింది – ఏ పులిఅయినా వచ్చి, తనను చంపితినని, తనకష్టాలు కడతేరుస్తుందని. కాని అదీ జరగలేదు. ఆమె ఏడ్చి ఏడ్చి, చివరకు ఒక చెట్టుమానుకు చేరగిలబడి నిద్రపోయింది.

పక్షుల కలకలానికి ఆమె నిద్ర లేచింది. ఎండ కాస్తున్నది. ఇందిర తనను తాను చూసుకుని, దొంగలు తనకు వితంతువు ఆకారం కల్పించి వెళ్ళిపోయారని తెలుసు కున్నది. ఆమె లేచి, ఏదన్నా కాలిబాటకోసం వెతికింది. చివరకు ఒకబాట దొరి



కింది. దానివెంట కొంతదూరం నడిచాక ఒకగ్రామం సమీపంలో ఉన్న లక్షణాలు పొడగట్టాయి.

అప్పటికే ఆమెకాళ్ళు, నడక అలవాటులేక, మొద్దుబారిపోయాయి. రాత్రి నిద్ర లేకా, దొంగల సంఘటనవల్లా ఆమె నరాలు చాలా దెబ్బతిని ఉన్నాయి. ఆమె మళ్ళీ ఒకచెట్టుకు చేరగిలబడి నిద్రపోయింది.

ఆమెకు తిరిగి నిద్రాభంగమయేసరికెవరో అలగాకుర్రాడు ఆమె చెయ్యి పట్టు



కుని గుంజుతున్నాడు. ఇందిర ఒకరాయి తీసుకుని చివాలునలేచి, వాడినెత్తిన ఒకటి పెట్టింది. వాడు పారిపోయాడు.

అక్కడే ఇంకోపిల్లకూడా ఉన్నది. ఆ పిల్లను వెంటబెట్టుకుని ఇందిర కొంత దూరం వెళ్ళేసరికి, ఆవును తోలుకుపోతున్న ఒక ముసలిది కనబడింది. ఇందిర ఆమెను, మహేశ్వరుడుగాని, మనోహరుడుగాని దారి చెప్పమని అడిగింది.



ఆ ముసలిది ఇందిరను తన ఇంటికి తీసుకుపోయి, తాగటానికి ఇన్ని పాలు ఇచ్చి, మహేశ్వరుకు దారి చెప్పింది.

ఇందిర సాయంకాలందాకా ఆ దారిన నడిచింది. దారిలో తగిలిన ఒక మనిషిని, "బాబూ, మహేశ్వరు ఇంకా ఎంత దూరం ఉంది?" అని అడిగితే, "మహేశ్వరు ఇటెక్కడ ఉంది? అటుగా వెళ్లాలి. ఇక్కడినుంచి ఒకరోజు ప్రయాణం." అన్నాడు.

ఇందిర హతాశురాలైపోయి, "నువెక్కడికి వెళుతున్నావు?" అని అడిగింది. అతను గౌరీగ్రామం పోతున్నానన్నాడు. ఆమె అతనితోబాటే నడిచి గౌరీగ్రామం చేరింది.

ఆ మనిషి బ్రాహ్మణార్థాలు చేసి జీవించే ఒక వృద్ధుడు. ఇందిరకు ఆ గ్రామంలో



ఎవరూ లేరని తెలిసి, ఆమెను తన ఇంటికే తీసుకువెళ్ళి, కట్టుకునేటందుకు రెండు చీరె లిచ్చాడు. బ్రాహ్మణుడి భార్య ఇందిరకు కడుపునిండా తిండి పెట్టింది.

ఇందిర ఆ బ్రాహ్మడి వెంటనే కొన్ని రోజు లుండి కొంత శక్తి తెచ్చుకున్నది. ఆమెకు పుట్టింటికి వెళ్ళాలని ఉన్నది గాని, వెళ్ళే మార్గమే కనబడలేదు. ఒక రిద్దరు మహేశ్వూరు వెళ్ళేవాళ్లు తగిలారు గాని, వాళ్ళు మంచివాళ్ళు కారని, ఇందిరను వాళ్ళవెంట పంపటానికి బ్రాహ్మడు పస్తాయించాడు. అటుకేసి వెళ్ళే ఆడవా ళ్ళెవరూ లేకపోయారు. దగ్గరప్రయాణమైనా కాదు.

ఇంతలో ఒక కుటుంబం కలకత్తా పోతూ ఉండటం తటస్థించింది. ఇందిరకు కలకత్తా వెళ్ళా లనిపించింది. అక్కడికి ఆమె పుట్టిల్లూ, అత్తవా రిల్లూ కూడా దగ్గరే. అదీగాక ఆమె పినతండ్రి ఒకడు కలకత్తాలోనే ఉంటున్నాడు: ఆయన దగ్గిరికి పోవచ్చునని ఇందిర ఆశ. ఈ ఆలోచన బ్రాహ్మడికికూడా బాగానే ఉన్నట్టు తోచింది. ఆయన ఇందిరను కృష్ణదాసబోసుగా రింట దిగవిడిచాడు. ఇందిరను కృష్ణదాసబోసు కుటుంబం పడవప్రయాణం చేయించి కలకత్తా తీసుకుపోయింది.

కాళీమాతకు అర్చనలు చేయించటానికి వచ్చిన కృష్ణదాసు భవానీపూర్‌లో బస చేశాడు. "మీ బాబాయి ఉండేది ఏ ప్రాంతం? ఏ వీధి?" అని అడిగితే ఇందిర చెప్పలేకపోయింది. మనిషి పేరు చెప్పగానే ఇల్లు తెలియటానికి ఇది తమ గ్రామం లాటిది కాదనీ, కలకత్తానగరం ఒక మహాసముద్రమనీ ఆమె ఇప్పుడు గుర్తించింది.

కృష్ణదాసు కలకత్తాలో స్థిరంగా ఉండిపోయేవాడైనా కాదు. ఆయన కలకత్తాలో అర్చనలు పూర్తి కాగానే కాశీ వెళుతున్నాడు. ఏం చెయ్యాలో తెలీక ఇందిర ఏడవ నారంభించింది.

"నువు సరేనంటే నిన్ను ఎవరిదగ్గరైనా పనికి కుదిర్చే ఏర్పాటు నేను చేస్తాను," అన్నది కృష్ణదాసు భార్య.

"చివరకు నాకు పనిమనిషి గతి కూడా పట్టుతున్నదా?" అని ఇందిర భోరున ఏడ్చింది. ఆమె మాడి చావటానికైనా సిద్ధపడింది గాని, పనిమనిషిగా జీవించ దలచలేదు.

ఆరోజు సాయంకాలం కృష్ణదాసు భార్య తన అక్కకూతురు సుభాషిణిని ఇందిర దగ్గిరికి తీసుకువచ్చి, "నువు సరేనంటే మా సుభాషిణి నిన్ను పనిమనిషిగా పెట్టుకుని వెంట తీసుకుపోతుంది!" అన్నది.

ఇందిర తలఎత్తి సుభాషిణిని చూసింది. ఆమె ఇంచుమించు తన యీడుదే. వెంట మూడేళ్ళ కొడుకున్నాడు. మనిషి అందంగా వున్నది. ఆమె కలకత్తాలోనే కాపరం ఉంటున్నది. పినతల్లి వచ్చిందని తెలిసి చూసిపోదామని వచ్చింది.

సుభాషిణి సంపన్నురాలే కావచ్చు. కాని ఇందిర తక్కువ పుటక పుట్టినదికాదు. చిన్నతనంలో ఆమె కొక కోరిక ఉండేది_పక్కమీద రూపాయలు పరిచి వాటి మీద పడుకోవాలని. ఈమాట తలుచుకున్న ఇందిరకు ఇప్పుడు ఏడుపూ, నవ్వూ కూడా వచ్చాయి.

ఇందిర మనస్థితిని సుభాషిణి అర్థం చేసుకున్నట్టు కనబడింది. ఆమె ఇందిరను అవతలికి తీసుకుపోయి, ఆమెను ఆప్యాయంగా, "చెల్లీ", అని పిలిచి, ముందు పేరడిగింది. ఇందిర తన పేరు కుముదిని అని చెప్పింది. తాము కాయస్థులమని కూడా చెప్పింది.

సుభాషిణి ఆమెను మిగిలిన వివరాలు అడగక, "నువు పెద్దఇంటిదాని వనీ, దాసీపనికి ఒప్పుకోవనీ తెలుస్తూనే వుంది. కనీసం నీకు వంట చాతనవునా?" అన్నది.

తనకు వంట చాతనవుననీ, తన వంటను నలుగురూ మెచ్చుకునేవాళ్ళనీ ఇందిర జవాబు చెప్పింది.

"మా ఇంట్లో మేమంతా వంట చేస్తాం. అయినా కలకత్తా రివాజు ప్రకారం ఒక వంటమనిషి అంటూ వుంటుంది. అచ్చగా నువు వంట చెయ్యాలని ఏమీలేదు. మాతోపాటు నువు కూడా వంట చేస్తూ వుండవచ్చు. నీ కిష్టమేనా?'' అని సుభాషిణి అడిగింది.

"దాసీపనికి కూడా నేను తయారుగానే వున్నాను," అన్నది ఇందిర.



"ఆలా ఒక్కనాటికి అనుకోవద్దు. నేను వెళ్ళి మా అత్తగారితో చెప్పి, నీ కోసం మనిషిని పంపిస్తాను; ఏం?" అన్నది సుభాషిణి.

తరవాత ఆమె వెళ్ళి తన పిన్నితో ఏదో మాట్లాడివచ్చి, "పద, బండి సిద్ధంగా ఉంది,'' అంటూ దొడ్లో ఆరేసివున్న రెండో చీరెకూడా తెచ్చుకోనివ్వకుండా, కట్టుబట్టతోనే ఇందిరను బండిలో ఎక్కించి తీసుకుపోయింది.

ఇందిర కాయస్థులపిల్ల అని తెలిసి, సుభాషిణి ఆమెచేత వంట చేయించుకునేటందుకు అభ్యంతరం చెప్పింది.

"ఇన్నాళ్ళూ బ్రాహ్మణవంట తిన్నాం," అన్న దామె.

బ్రాహ్మణపిల్లలు వంటకు అంత తేలిగ్గా దొరకరనీ, దొరికినా వాళ్ళు ఇంటివాళ్ళను వంటింటి చాయలకు రానివ్వరనీ, తాము తిన్నాకనే ఇంటివాళ్ళను తిననిస్తారనీ సుభాషిణి గబగబా చెప్పేసింది.

అత్తగారు ఆమాట నిజమేనని ఒప్పుకుని, ఇందిరకు జీత మెంత కావాలని అడిగింది.

"ఎంత ఇచ్చినా సరే," అన్నది ఇందిర.

బ్రాహ్మణపిల్ల అయివుంటే ఎక్కువే ఇచ్చివుండేదాన్ననీ, కాయస్థులపిల్ల గనక, తిండీ, బట్టా కాక పైన నెలకు మూడురూపాయ లిస్తాననీ అత్తగారు తెలియబరిచింది.

అందుకు ఇందిర సమ్మతించింది.

అంతలోనే అత్తగారి కింకో అనుమానం వచ్చింది.

"చీకట్లో చూపు సరిగా ఆనటంలేదు. నీ వయస్సెంత అన్నావూ?" అన్న దావిడ.

"పందొమ్మిది వెళ్ళాయి," అన్నది ఇందిర.

"ఇంకానయం! ఆ వయసులో నిన్ను పనిలో ఎట్లా పెట్టుకునేది? ఇం కెక్కడన్నా పని చూసుకో," అన్నది సుభాషిణిఅత్తగారు.

వయసుతో పేచీ దేనికన్నది సుభాషిణి. వయసులో వున్నవాళ్ళు పనిచెయ్య రన్నది అత్తగారు. దేశంలో వయసులోవున్న పిల్లలంతా సోంబేర్లుగా తిరుగుతున్నారా అని కోడలు అడిగింది. వయసులో వున్న పనిపిల్ల ఇంట్లో తిరుగుతూం డటం బాగుండదన్నది అత్తగారు.

ఇందిర అక్కడినుంచి బయలుదేరింది.

సుభాషిణి ఆమె వెనకే వచ్చి ఆపి, ఆమెను తన పడకగదిలోకి తీసుకుపోయింది.

"నన్ను వెళ్ళిపోనివ్వండి. ఇటువంటి మాటలు పడటం నాకు అలవాటు లేదు," అన్నది ఇందిర.

నిన్ను బలవంతాన వుంచను. ఈ రాత్రికి వుండి తరవాత వెళ్ళు. గృహస్థుల ఇంటినుంచి భోజనమైనా చెయ్యకుండా ఎలా పోతావు?'' అన్నది సుభాషిణి.

నిజానికి ఇందిరమటుకు ఆ రాత్రివేళ ఎక్కడికని పోగలదు?

"ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయాక ఏం చేద్దా మనుకుంటున్నావు?" అని సుభాషిణి అడిగింది.

"గంగలో పడదా మనుకుంటున్నాను," అన్నది ఇందిర.

"నువు ఏ గంగలోనూ పడకు. నేను ఎలా చక్రం తిప్పుతానో చూస్తూవుండు. అనవసరంగా గడబిడ చెయ్యకు," అన్నది సుభాషిణి.

ఆమె తన సొంతదాసి అయిన హారిణిని పిలిచి, తన భర్తను పిలుచుకురమ్మని పంపింది. ఇందిర అవతలికి పోదామనుకుంది గాని సుభాషిణి ఆమెను వుండమన్నది.

సుభాషిణి భర్త రమేన్ వస్తూనే ఇందిరను చూసి, ఆమె ఎవరని తన భార్య నడిగాడు.

"ఈమెను గురించే మిమ్మల్ని పిలిచింది. ఈమెను మా పిన్నిదగ్గిర్నుంచి వంటకని తీసుకొచ్చాను. ఈమె ఇక్కడ వుండ రాదని అత్తయ్య అంటున్నారు," అన్నది సుభాషిణి.

"ఏం?"

"వయసులో వున్నదనిట!''

"అయితే, నే నేం చేసేదీ?''

''ఈమె ఇక్కడే వుండేటట్టు చెయ్యాలి."

''ఎందుకూ?"

సుభాషిణి రహస్యంగా భర్తతో, "నా ఆజ్ఞ గనక!" అన్నది.

"సరే."

"ఎప్పుడు చేస్తారు?''

"భోజనమప్పుడు."

రమేన్ వెళ్ళిపోయాక ఇందిర, "నన్ను ఎలాగో వుంచగలుగుతారే అనుకున్నా, ఇటువంటి మాటలు ఎలా పడను?'' అని సుభాషిణితో అన్నది.

"ఆ సంగతి తరవాత చూద్దాం," అన్నది సుభాషిణి.

రాత్రి తొమ్మిదిగంటలప్పుడు రమేన్ భోజనానికి వచ్చి, తల్లిదగ్గిర కూర్చున్నాడు. సుభాషిణి ఇందిరను వెంటపెట్టుకుని వెళ్ళి చాటున కూర్చుని, ''చూస్తూ వుండు," అన్నది.

వడ్డన జరిగింది. రమేన్ ఒక్కొక్క వంటకమే రుచి చూసి, బాగా లేదని పక్కకు తోసేశాడు. మొత్తంమీద అతను ముద్ద ఎత్తనేలేదనవచ్చు.

"ఏమీ తినటమే లేదేంరా, నాయనా?" అని తల్లి అడిగింది.

"ఈ వంట కుక్కలు కూడా తినవు. బ్రాహ్మణవంట తినీ, తినీ నోరు చవి చచ్చిపోయింది. రేపటినుంచీ అత్తయ్యావాళ్ళ యింటో తిందామని చూస్తున్నాను," అన్నాడు రమేన్.

"నీకు పుణ్యం వుంటుంది. ఆ పనిమటుకు చెయ్యకు. రేపణ్ణుంచీ ఇంకో వంట మనిషినైనా పెడతాను,'' అన్నది తల్లి.

రమేన్ చెయ్యి కడుక్కొని వచ్చేసేటప్పుడు సుభాషిణి అతనితో, ''మా మూలంగా ఈ పూట మీరు వస్తు!'' అన్నది.

ఇందిర నిర్ఘాంతపోయి చూస్తూ వుండిపోయింది.

ఇంతలో హారిణి వచ్చి సుభాషిణితో, ''అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు,'' అని చెప్పింది.

సుభాషిణి వెళ్ళింది. ఆమెను అత్తగారు, ''ఆ కాయస్థపిల్ల వెళ్ళిపోయిందా?'' అని అడగటం ఇందిర విన్నది.

''లేదు. భోజనం పెట్టకుండా ఎలా పంపనని ఉంచేశాను,'' అన్నది సుభాషిణి.

''వంట బాగా చేస్తుందా?''

''ఏమో, నాకు తెలీదు.''

''ఆమెను కొత్త అపు. రేపు వంట చేయించి చూతాం,'' అన్నది అత్తగారు.

సుభాషిణి ఇందిర దగ్గిరికి తిరిగివచ్చి, ''చెల్లెమ్మా, నీకు నిజంగా వంట చెయ్యటం బాగా వచ్చా?'' అన్నది.

''రేపు చూస్తారుగా!'' అన్నది ఇందిర.

''అలవాటు తప్పితే చెప్పు, నేను దగ్గిరుండి సహాయం చేస్తాను,'' అన్నది సుభాషిణి.

''ఆ విషయం తరవాత చూద్దాం,'' అని ఇందిర నవ్వింది.

మర్నాడు ఇందిర వంట చేసేటప్పుడు సుభాషిణి సహాయం చేద్దామని వచ్చి, ఇందిర తెప్పించిన మిరపకాయల కొరకు తట్టుకోలేక వెంటనే వెళ్ళిపోయింది.

ఆపూట రమేన్ అన్నంముందు కూర్చుని ఆప్యాయంగా తింటూ, ''ఈ పూట వంట ఎవరు చేశారు?'' అని తల్లిని అడిగాడు.

''కొత్త వంటమనిషిని పెట్టాను,'' అన్నది తల్లి.

''వంట దివ్యంగా వుంది,'' అంటూ రమేన్ భోజనం పూర్తిచేసి వెళ్ళిపోయాడు.

రమేన్ తండ్రికూడా ఇందిర వంటను మెచ్చుకున్నాడట. అది చూసి పాత వంటమనిషికి చాలాకోపం వచ్చింది. ఆమె కోపాన్ని ఇందిర దగ్గిర వెళ్ళబోసుకుంది.

రమేన్ తల్లి భోజనం చేసేటప్పుడు మాత్రం ఇందిర దగ్గిరే ఉండి, ఆమె భారీగా భోజనం చెయ్యటం గమనించింది.

''వంట చాలా చక్కగా చేశావు. గొప్ప ఇంటి పద్ధతిగా వున్నది. ఎక్కడ నేర్చుకున్నావు?'' అన్నదామె ఇందిరతో.

''మా పుట్టింటే నేర్చుకున్నాను,'' అన్నది ఇందిర.

''మీ వాళ్ళు గొప్పయింటివాళ్ళా ?''

''అవును.''

''మరి నీ కీ వంటలక్క పనేమిటి ?''

''కాలం కలిసిరాలేదు.''

''అయితే ఇక్కడే ఉండిపో. నిన్ను గొప్పయింటిదానిలాగే చూస్తాం.''

తరవాత ఆమె తన కోడలితో, ''ఈ అమ్మాయిని ఏమీ అనకు. గొప్పింటిపిల్ల ! ఇక్కడే వుండమన్నాను,'' అని హెచ్చరించింది.

# 2

ఇందిరకు ఆశ్రయం దొరకటమే గాక సుభాషిణిలాంటి స్నేహితురాలు కూడా దొరికింది. ఆమె ఇందిరను చెల్లెలులాగా చూసుకుంటున్నది. అది చూసి ఇంటి నౌకర్లు కూడా ఇందిరను చాలా మర్యాదగా చూస్తున్నారు.

అయితే ఒక సమస్య ఏర్పడింది. ఇప్పుడింట్లో ఇద్దరు వంటవాళ్ళు తయారయారు. కుముదిని—అంటే ఇందిర—ఒక్కతే వంటయింటి పని అంతా చెయ్యలేదు; గనక, ఒక్క వంటమనిషే వుండాలంటే పాతమనిషినే వుంచుకోవలసి వస్తుంది. ఆ మనిషి వంట ఎవరికీ సయించదు. అందుచేత సుభాషిణి అత్తగారు ఇద్దరినీ వుండనివ్వటానికి రాజీపడింది. ఇదంతా సుభాషిణి చాకచక్యంతోనే జరిగింది.

ఆమె తెలివిగా అత్తగారితో వాదించటమనే ఇందిరకు వంటింటి చాకిరీఅంతా చేసే అవస్థ తప్పింది. ఇలా ఎన్నోవిషయాలలో సుభాషిణి ఇందిరకు తెలివిగా తోడ్పడుతూవచ్చింది. ఇందిర ముఖ్యమైనవంటకాలు ఒకటి, రెండు చేసి, మిగిలిన సమయమంతా సుభాషిణితో కబుర్లు చెప్పటమూ, సుభాషిణి కూతురికీ, కొడుక్కూ కథలు చెప్పటమూ చేస్తూఉండేది.

సుభాషిణి అత్తగారుకూడా ఇందిరతో కబుర్లాడుతూ, ఆమెచేత తన తలలో నెరిసినవెంట్రుకలు లాగేయించుకుంటూ ఉండేది.

"అత్తగారి తలనిండా అన్నీ నెరిసినవెంట్రుకలే ! అవన్నీ తీసేసి ఆమెతల బోడిచెయ్య దలుచుకున్నావేమిటి ?" అన్నది సుభాషిణి ఒకసారి.

''మరి ఏం చెయ్యాలి ?'' అన్నది ఇందిర.

''నాలుగు వెంట్రుకలు తీసి, ఇక లేవని చెప్పు.'' అన్నది సుభాషిణి.

''అబద్ధాలాడితే నన్ను అందరూ కాలాదీఘీ దొంగలకింద జమకట్టరా ?'' అన్నది ఇందిర నోరు జారి.



"వా శ్ళెవరు ?" అన్నది సుభాషిణి.

"తరవాత చెబుతాలే," అన్నది ఇందిర. ఆమె వెంట్రుకలకు వేసేరంగు పనిదాని చేత తెప్పించి, సుభాషిణిఅత్తగారి తలకు వేసేసింది. ఆవిడ చాలా సంతోషించింది.

ఆరోజు సాయంకాలం సుభాషిణి కాలాదీఘీ దొంగలనుగురించి వినితీరాలని పట్టుబ ట్టింది.

"ఆ కాలాదీఘీ దొంగలమూలానే నే నివాళ ఈగతికి వచ్చాను. నాతండ్రి చాలా

ఐశ్వర్యవంతుడు. మీ అత్తగారికన్న కూడా ఐశ్వర్యవంతుడు. కాని నే నిప్పుడు ఎవరిపంచనో తలదాచుకుని పనిమనిషిగా పొట్ట పోసుకుంటున్నాను." అంటూ ఇందిర తనకథ అంతా పూర్తిగా సుభాషిణికి చెప్పేసింది. ఆమె తనతండ్రి ఊరూ పేరూ, తన అత్తవారి ఊరూ పేరూమాత్రం బయటపెట్టలేదు. ఆమె కథ వింటూ సుభాషిణి, ఆమెతోసమంగా కళ్ళు తుడుచుకుంది.

ఆరోజు అంతటితో పోయిందిగాన్ని, మర్నాడు సుభాషిణి ఇందిరను ఆమెతండ్రి ఊరూ, పేరూ అడిగింది. ఇందిర చెప్పింది. తన పుట్టినఊరికి దగ్గిర పోస్టాఫీసు పేరుమాత్రం ఆమెకు తెలియక, చెప్పలేకపోయింది.

సుభాషిణి ఇందిర కథఅంతా తనభర్తకు చెప్పి, ఆమెతండ్రికి ఒకఉత్తరం రాయించింది. వాళ్ళ ఊరిలోనే పోస్టాఫీసు ఉన్నట్టు భావించుకుని, ఉత్తరంమీద "మహేశ్‌పూర్ పోస్టు," అని వ్రాశారు.

ఈసంగతి సుభాషిణి తనతో చెప్పినప్పుడు ఇందిర సంతోషించింది. జవాబుకోసం ఇద్దరూ ఎంతో ఆత్రంగా ఎదురుచూశారు. కొన్నాళ్ళయాక రమేన్ రాసిన ఉత్తరం బట్వాడాకాకుండా అతనికే తిరిగివచ్చేసింది. మహేశ్పూర్‌లో పోస్టాఫీసు లేదు.

ఈసారి సుభాషిణి ఇందిరను ఆమెభర్తపేరూ, ఊరూ అడిగింది. మామగారి పేరు అడిగింది. పోస్టాఫీసు ఏవూళ్ళో ఉండేదీ ఆమెకు ఈసారికూడా తెలియదు. అక్కడికి కూడా ఉత్తరం వెళ్ళింది, కాని జవాబు రాలేదు. తనను దొంగ లెత్తుకు పోయిన కారణంచేత కులభ్రష్టగా భావించి, తన మామగారూ, భర్తా తనను స్వీకరించ నిరాకరించి ఉంటా రనుకుని ఇందిర హతాశురాలై పోయింది. ఆమెకు భవిష్యత్తు అంధకారంగా కనిపించింది.

ఒకనాడు ఇందిర నిద్ర లేచేసరికి ఇల్లంతా అడావుడిగా ఉన్నది. రమేన్ వకీలు. అతనిక్లయంటుఒకరు కలకత్తా వచ్చిన సంగతి రెండురోజులుగా ఆమె వింటున్నది. ఆయన ఇవాళ భోజనానికి వస్తున్నాడట. అదీ అడావుడి.

ఇవాళ ప్రత్యేకించి వంట బాగుండాలిగనక, వంటపని పూర్తిగా ఇందిరమీదనే పడింది. ఇందిర తనకుగల నేర్పంతా వంటలో చూపింది.

రమేన్, అతనితండ్రీ, అతని క్లయంటూ భోజనాలు చేసేటప్పుడు పాత వంటలక్కే వడ్డన చేసింది. ఎంచేతనంటే ఇందిర ఇంట్లోవాళ్ళకుతప్ప వడ్డన చెయ్యదు. అయినా ఆమె వడ్డనకు వెళ్ళక తప్పలేదు. ముసలివంటలక్క వడ్డన చూసి రమేన్‌తండ్రి చిరాకుపడి, పంపేశాడు.

చీరె నెత్తిమీదకు లాక్కుని, ఇందిర వడ్డనకు వెళ్ళింది. ఆమె ముసుగులోనుంచే అతిథిని చూసింది. అతను ముప్పై ఏళ్ళవాడు; చాలా అందంగా ఉన్నాడు. అతనిది

చూసిన ముఖంలాగే ఉన్నది. మళ్ళీ చూడాలనికూడా అనిపించింది. మళ్ళీ చూసినప్పుడు ఆమె తనభర్తను పోల్చుకున్నది.



అతిథి రమేష్ తండ్రితో, "మీ వంటమనిషి చాలా బాగా వంట చేస్తుంది. ఆశ్చర్య మేమిటంటే, ఈ వంటకాలలో కొన్ని మా ప్రాంతానివి. ఇక్కడి వంటమనిషికి ఇవి ఎలా వచ్చా యని !" అన్నాడు.

"వంటమనిషి ఈ ప్రాంతానిది కాదు."

అతిథి ఇందిరకేసి తిరిగి, "మీ దేవూరు ?" అని అడిగాడు.

ఇందిర కొంచెం ఆలోచించి, "మా ఇల్లు కాలాదీఘీలో," అన్నది.

అతను ఆశ్చర్యపోయి, "కాలాదీఘీ అంటే దొంగలసరస్సేనా ?" అని అడిగాడు.

"అవును," అన్నది ఇందిర.





అతను మరింత కంగారుపడిపోయాడు.

రమేన్ తండ్రి అతన్ని, ''ఉపేంద్రబాబూ, స్థిమితంగా భోజనం చెయ్యండి,'' అని హెచ్చరించాడు.

ఇందిర కింక సంశయం మిగల్లేదు. అతనే తనభర్త!

దైవికంగా కలిగిన ఈ సంయోగాన్ని చేయి జారవిడవరాదని ఆమె నిశ్చయించుకున్నది. సిగ్గుపడిపోతే తాను ఏమీ చేయలేదు. ఆమె వీలయినప్పుడల్లా సూటిగా అతన్ని చూస్తున్నది; ఆమెకేసి చూసినప్పుడల్లా అతనికళ్ళలో ఆస్త్రృత కనిపిస్తున్నది.

అతను బసకు వెళ్ళిపోయాక ఇందిర హారిణిని ఏకాంతంగా పట్టుకుని, "ఇవాళ అతిధిగా వచ్చిన బాబుగారి బస ఎక్కడ? ఈవూళ్ళో ఇంకెంతకాలం ఉంటారు? కాస్త కనుక్కుని చెప్పాలి," అన్నది.

"ఛీ! ఛీ! నీకూడా ఇటువంటి తెగులున్న దనుకోలేదు" అన్నది దాసి హారిణి.

ఇందిర నవ్వి, ''ఒక్కొకరి కొక్కొక తెగులు! నాకు నీ నీతులు వద్దు. నే నడిగిన విషయాలు కాస్త తెలుసుకో.'' అన్నది.

అటువంటిపని తనవల్ల కాదన్నది హారిణి. ఇందిర ఆమెచేతిలో అయిదు రూపాయలు పెట్టి, ''ఈపని నీవల్లే కావాలి. బతికున్నన్నాళ్ళూ నీపేరు చెప్పుకుంటాను,'' అన్నది.

హారిణి డబ్బు విసిరిపారేసి, ఇంక ఈ ప్రసంగం ఎత్తవద్దని కోప్పడింది.

అసహాయతవల్ల ఇందిరకు ఏడుపు వచ్చేసింది. హారిణి సహాయపడకపోతే ఆమెకు వేరే దిక్కులేదు.

ఇందిర కన్నీరు చూసి, హారిణి కొంచెం మెత్తబడి, "ఏడుస్తున్నా వెందుకు? నీ కాయన తెలుసా?" అని అడిగింది.

"అవును. నా కాయన తెలుసు. బాగా తెలుసు. చెబితే నీకు అర్థంకాదు. అందు చేత నీకు వివరాలు చెప్పను. నేనేమీ తప్పుపని చెయ్యటంలేదని మాత్రం నమ్ము." అన్నది ఇందిర.

హారిణి ఆమెను వదలక ప్రశ్నలు వేసింది; "నువు ఆయనతో మాట్లాడతావా? వంటరిగానా? ఎప్పుడు?"

రాత్రి అందరూ నిద్రపోయాక ఆయనతో మాట్లాడతానని ఇందిర అన్నది.

"సుభాషిణీఅమ్మ ఇందుకు ఒప్పుకున్నారా?" అన్నది హారిణి.

"నీ కేమన్నా మతి పోయిందాఏమిటి? ఇలాటివి ఆమెకో చెప్పిచేస్తావా?" అన్నది ఇందిర.

"సరే, నీ డబ్బు నీ దగ్గిరే ఉండనీ. నువ్వడిగిన సమాచారం చెబుతాను," అని హారిణి వెళ్ళిపోయింది.

ఇందిర సుభాషిణివద్దకు వెళ్ళింది. ఇంధిరనుచూస్తూనే ఆమె, "గుర్తుపట్టావా?" అని అడిగింది.

ఇందిర కొయ్యబారిపోయి, "నీ కెలాతెలుసు?" అని అడిగింది.

"నీకోసం కొండమీది కోతిని తెచ్చి కట్టిఉంచాం," అన్నది సుభాషిణి.

"మేం అంటే – రమేన్ బాబుగారు కూడానా?"

"మరెవరు? నీ భర్త పేరూ, మామ పేరూ, వాళ్ళ ఊరూ చెబితివిగా? రమేన్ బాబుగారికి వెంటనే తెలిసిపోయింది. మీ వారి వ్యవహారం ఒకటి మావారు చూస్తు న్నారు. ఆ పనిమీద మీవారిని కలకత్తాకు రమ్మని రాశారు. మీవారు వచ్చారు. తరవాత జరిగినది నీకూ తెలుసు."

"మరి మమ్మల్ని పరిచయం చెయ్యలేదేం?"

"నిన్ను పరిచయం చెయ్యగానే వారు తీసుకుపోయి ఇంట్లో పెట్టుకుంటా రను కుంటున్నావా? నిన్ను మొదట దొంగలెత్తుకుపోయారు. ఆ తరవాత ఎక్కడెక్కడ తిరిగావో, ఏమేం చేశావో ఎవరికి తెలుసు? నిన్ను చెడిపోయినదానికిందే చూస్తారు."

"ఏమైనా సరే, వారిని ఒక్కసారి కలుసుకోవాలి," అన్నది ఇందిర.

"ఎప్పుడు ? ఎక్కడ ?''

"అందరూ నిద్రపోయాక ఇక్కడే కలుసుకుంటాను. తప్పేం ? ఆయన నా భర్తేగా?"

"తప్పేమీ లేదులే. కాని ఈరాత్రికి ఆయన్ని ఇక్కడే ఉంచేసే దెలా ? ఆయన బస దగ్గరలోనే ఉంది... మావారి సలహా తీసుకుంటాను."

సుభాషిణి వెళ్ళి భర్త నడిగివచ్చి. "ఆయనను కాగితాలతోసహా రమ్మని, పొద్దు పోయినదాకా వ్యవహారాలు మాట్లాడి, ఇక్కడే భోజనానికి ఉంచవచ్చు. ఆ తరవాత ఆయన ఇక్కడే పడుకునేటట్టు చేసే దెలా ?'' అన్నది.

"ఆ పని నేను చేస్తాను. ఒక ఉత్తరం రాసి ఎవరిచేతనైనా పంపుతాను," అన్నది ఇందిర.

''ఎవరు తీసుకుపోతారు ?''

"నీ అనుమతి అయితే హారిణి తీసుకుపోతుంది. కాని నిన్ను అనుమతి ఇవ్వమని ఎట్లా అడగను. నాకు చావొచ్చింది."

"నేను పొమ్మంటే పోతానని అది అన్నదా ? అయితే నేను పొమ్మన్నానని చెప్పు," అన్నది సుభాషిణి.

ఇందిర ఒకకాగితంమీద, "నా మానప్రాణాలు మీకు అర్పించుకుంటున్నాను. స్వీకరించటానికి అభ్యంతరం లేకపోతే ఈ ఇంట్లోనే, ఈ రాత్రే నన్ను కలుసుకోండి. తలుపు తీసి ఉంచుతాను – వంటలక్క." అని రాసి, హారిణిని పిలిచి, "చిన్నమ్మగారి అనుమతి పొందాను; ఈ కాగితాన్ని, ఒంటరిగా ఉన్నప్పుడు మన అతిథికి చూపించి, మళ్ళా పట్రా," అన్నది.

ఆ సాయంకాలం ఉపేంద్రుడు కాగితాలతోసహా వచ్చినప్పుడు హారిణి అతనికి ఆ కాగితం చూపించి. తెచ్చి ఇందిర కిచ్చింది.

"చూడూ, నా కింకో ఉపకారంకూడా చెయ్యాలి. ఈరాత్రి నన్ను నీ గదిలో పడుకోనీ," అన్నది ఇందిర.

"దాని కేంలే. కాని ఇందులో పాతకం ఏమీ లేదుగద ? అన్నది హారిణి.

"ఏమీలేదు. ఆయన ఒకజన్మలో నాకు భర్త."

"ఏ జన్మలో ? ఈ జన్మ మాటేమిటి ? అదే నాకు తెలీకుండా ఉంది," అన్నది.

"నోరుముయ్యి !'' అన్నది ఇందిర. హారిణి నవ్వుతూ వెళ్ళిపోయింది.

ఇందిర వెళ్ళి జరిగినదంతా సుభాషిణికి చెప్పింది. సుభాషిణి తన అత్తగారితో,



ఈపూట వంట పాత వంటలక్కను చెయ్యనీయమని చెప్పి, తాను ఇందిరను తనగదికి తీసుకుపోయి, తలుపులోపల బిగించి, ఇందిరను ముస్తాబు చెయ్యసాగింది.

ఇందిరకు ఒకవంక ఆనందం ఉన్నా, ఇంకోవంక బాధకూడా ఉన్నది. తాను తన భర్తను గుర్తించింది. తాను చెయ్యబోతున్నది తప్పు కాదని ఆమెకు తెలుసు. కాని తనభర్త? అతనికి తా నెవరో తెలీదు. అతను పరస్త్రీ ప్రణయానికి సిద్ధమవుతున్నాడు. అది అతనిలో దోషమే. కాని – తాను స్త్రీ; భర్తనుగురించి తప్పుగా అనుకునే అధికారం తనకు లేదు.

"ముందు అన్నిటికన్న ముఖ్యమైనది. నువు అతని మనస్సును వశపరచుకోవటం. మిగిలినదంతా దానిపైన ఆధారపడిఉంటుంది," అన్నది సుభాషిణి.

"ఆ విద్య నాకు కొంచెంకూడా రాదు," అన్నది ఇందిర.

"అందులో నేను ఆరితేరినదాన్ని. నేను నేర్పుతాను పట్టు!" అంటూ సుభాషిణి ఆమెకు అనేక రహస్యవిషయాలు బోధ చేసింది.

మగవాళ్ళ భోజనా లయాక, ఉపేంద్రుడు చాలానీరసం చేసినట్టు నటించి కొంత

గల్లంతుచేసి, బసకు పోయే ప్రయత్నం మాని, అక్కడే పడుకుంటానని తెలియజేశాడు.

ఇందిర హారిణిదాసి గది చేరుకున్నది. అంతా నిద్రలు పోయాక హారిణి వచ్చి, ఇందిరను ఉపేంద్రుడి గదిదగ్గిరికి తీసుకుపోయింది. గదిలో అతను ఒక్కడే ఉన్నాడు. అతనికి జబ్బేమీలేదు. గదిలో రెండుదీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

ఇందిరకు శరీరం ఒక్కసారిగా వివశమయింది. ఆమె కంఠనాళాలు ముడుచుకుపోయి, మాట రాకుండా చేసేశాయి. ఆమె అశక్తతతో ఏడవసాగింది.

"ఎందుకేడుస్తున్నావు? ఇష్టమై వచ్చావు. నేను నిన్ను రమ్మన్నానా? ఏడుపెందుకు?" అన్నాడతను.

తనభర్త తనను నీతిమాలినదానికింద కట్టేసి మాట్లాడేసరికి ఆమెకు చాలా బాధ కలిగింది. "నేను మీ భార్యను," అని చెప్పేద్దామనుకుంది. కాని అతను నమ్మకపోవచ్చు; ఎవతో తనభార్య వృత్తాంతం విని దొంగఎత్తు వేసి, తనభార్యస్థానం కాజెయ్యజూస్తున్నదని అతను అనుకోవచ్చు. అందుచేత ఆమె ఆమాట అనక, ఇంకేదో సంభాషణ ప్రారంభించింది.

కొంతసేపు మాటలు జరిగాక, "మీ ఇల్లు కాలాదీఘీదగ్గిర అని అన్నావు. ఆ ప్రాంతాల నీఅంత అందగత్తె ఉంటుందని నేను కలలోకూడా అనుకోలేదు. నువు ఆ దేశంనుండి వచ్చి ఎన్నాళ్ళయింది?" అన్నాడు అతను.

"మీ భార్యను ఆ ప్రాంతంలో దొంగలెత్తుకుపోయారని చెప్పారే, ఆటు తరవాత నేనా ప్రాంతాలకు పోనేలేదు. మీరు మళ్ళీ పెళ్ళి చేసుకున్నారా?" అన్నదామె.

"లేదు."

అతని దృష్టిలో ఆమె ఒక అభిసారిక. ఆమెతో ఆత్మీయంగా అన్నీ చెప్పుకునే అవసరం అతనికి లేదు. అతను ఆమెకేసి చాలాసేపు చూసి, "నీ అందం నిజంగా అరుదైనది," అన్నాడు.

"నన్ను మీరు చేరదీస్తే, రేపు మీ భార్య తిరిగివస్తుందనుకోండి. సవతులమధ్య మీరు నలుగుతారు," అన్నది ఇందిర.

"అలాటి భయమేమీ లేదు. నా భార్య తిరిగివచ్చినా నేను స్వీకరించను. ఆమె ఎక్కడ వుందో? ఏ జాతిలో కలిసిందో?" అన్నాడతను.

ఇందిరకు ఒక్కసారిగా గుండె అవిసిపోయినట్టయింది. అతను తనను స్వీకరించని పక్షంలో ప్రాణత్యాగం చేస్తానని ఆమె అప్పుడే శపథం పట్టింది. అప్పుడు

గాని ఆమెకు ధైర్యం తిరిగిరాలేదు. ఆమె సరదాగా నవ్వుతూ అతనితో మాట్లాడ సాగింది.

అతను ఆమెకు దగ్గిరిగా జరిగాడు. వెంటనే ఆమె, "దగ్గిరికి రాకండి. మీరు నన్ను గురించి అపోహపడ్డట్టున్నారు. నేను కులటను కాను. మీతో సరదాగా ఊళ్ళు తిరగాలన్న కోరిక తప్ప నాకు వేరే దురుద్దేశ మేమీ లేదు," అన్నది, లేచి నిలబడుతూ.

అతను ఆమె మాటలను లక్ష్యపెట్టలేదు. ఆమె వెళ్ళిపోతున్నానని చెప్పి బయటికి పరుగుతీసింది. అతను ఆమెను వెంబడించి పట్టుకున్నాడు. "వెళ్ళిపోకు; నీ అందం చూస్తున్నకొద్దీ నాకు వెర్రెత్తుతున్నది. కొంచెంసేపు వుండిపోదువు గాని!" అని అత నన్నాడు.

"నన్ను పోనివ్వండి. పోవటం నాకు మాత్రం తేలికా? నే నేమన్నా కర్ర చెక్కనా? కాని సుఖంకోసం ధర్మాన్ని త్యాగం చెయ్యలేను. నేను కొంచెంకూడా ఆలోచించకుండా మీ కా ఉత్తరం రాశాను. ఇంకా నయం, ముందుగానే కళ్ళు తెరిచాను! వెళ్ళివస్తాను," అన్న దామె.

"నువు నీ ధర్మం గురించి ఆలోచించగలుగుతున్నావు. నా కీ క్షణంలో ధర్మా ధర్మాలు కూడా తెలియవు. నిన్ను ఎప్పటికీ నా హృదయంలో నిలుపుకుంటానని



ప్రమాణం చేస్తున్నాను. ఎప్పటికీ నా ప్రాణంతో సమంగా చూసుకుంటాను!" అన్నా డతను.

''క్షణికమైన ఆనందంకోసం మగవాళ్ళు ఎన్ని మాటలైనా చెబుతారు," అన్నది ఇందిర.

''నే నా దృష్టితో మాట్లాడటం లేదు,'' అంటూ అతను ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు. అతని అవస్థ చాలా దీనంగా వున్నది.

"మీ రనేది నిజమే అయితే నన్ను ఇప్పుడే మీ బసకు తీసుకుపొండి. నే నిక్కడే వుంటే నన్ను వదిలేసి వెళ్ళిపోగలరు," అన్నది ఇందిర.

అతను ఏమీ అభ్యంతరం చెప్పలేదు. అతని బస చాలా దగ్గర. ఇద్దరూ అక్కడికి వెళ్ళారు. అది రెండుగదుల భాగం. ఇందిర అందులో ఒక గదిలోకి వెళ్ళి, చప్పున గది తలుపు బిగించేసింది. అతను బయటిగదిలోనే వుండిపోయి, తలుపు తెరవమని ఆమెను ఎంతగానో బతిమాలాడు.

"మీ ప్రేమ తెల్లవారేదాకా నిలిచివుంటుందో, లేదో చూడాలి," అన్నది ఇందిర.

తెల్లవారి గాని ఆమె తలుపు తెరవలేదు. అప్పు డామె అతని గదిలోకి వచ్చి, అతనితో, "ఎనిమిది రోజులు మీరు నన్ను తాకరాదు. ఇది మీకు పరీక్ష. మీ మనసు మారివుంటే న న్నిప్పుడే పాతచోటికి తీసుకువెళ్ళవచ్చు.'' అన్నది.

అతను పరీక్షకు సమ్మతించాడు!

## 3

తొమ్మిదోరోజు ఆమె అతనికి వశమైపోయింది. పరీక్ష సాగిన ఎనిమిది రోజులూ ఆమె అతనితో ప్రేమగానే మాట్లాడింది; అతనికి అన్నిరకాల సేవలూ చేసింది; వంట చేసిపెట్టింది.

"ఈ ఎనిమిదిరోజులూ నువు చెప్పినట్టు విన్నాను. ఇక నువు నన్ను ఎన్నటికీ విడిచిపోనని మాట ఇయ్యి," అన్నా డతను.

కొన్ని రోజులు కలకత్తా జీవితం వా రిద్దరికీ ఎంతో స్వేచ్ఛగానూ, సుఖంగానూ గడిచిపోయింది.

తరవాత ఉపేంద్రుడికి ఇంటివద్దనుంచి పిలుపు వచ్చింది. అతను వెళ్ళాలి.

ఇందిర కంట కన్నీరు కారుస్తూ కుప్పకూలిపోయి, "నా మాట ఏమిటి?" అని అడిగింది.

"నిన్ను విడిచి ఎలా వెళ్ళటమా అనే నేనూ ఆలోచిస్తున్నాను," అన్నా డతను.

"నన్నుకూడా మీ యింటికి తీసుకుపోతారా? లేక ఎక్కడన్నా ఉంచుతారా?"

"అది పల్లెటూరు. ప్రతి సంగతీ క్షణంలో అందరికీ తెలిసిపోతుంది. నిన్ను ఎక్కడని వుంచగలను? ఏమీ పాలుపోవటం లేదు."

"వెళ్ళితీరాలా? త్వరగా తిరిగి వచ్చేట్టుంటే నన్నిక్కడే వుండనివ్వండి."

"వెంటనే తిరిగివస్తాను. కలకత్తాకు వస్తూ, పోతూ వుండకుండా జరగదు."

"మీరు వెళ్ళండి. నే నేమీ గొడవ చెయ్యను. నా గతి ఎలా రాసివుంటే అలా అవుతుంది," అన్నది ఇందిర ఏడుపుగొంతుతో.

"నిన్ను చూడకపోతే నాకూ పిచ్చెత్తినట్టుగానే ఉంటుంది."

"నేను మీ తాళికట్టిన భార్యను కాను. నాకు మీ వద్ద ఎలాటి అధికారమూ లేదు. నాకోసం అంత బెంగపడకండి."



అతని కా విషయం మాట్లాడబుద్ధి కాలేదు; ఆ రోజల్లా ఆలోచించి, ఆ సాయంకాలం రమేన్ బాబును రమ్మని కబురుచేశాడు.

తన భర్తా, రమేన్ బాబూ మాట్లాడినదంతా ఇందిర పక్కనుంచి విన్నది.

"మీ యింట్లో వంటమనిషిగా ఉండిన అమ్మాయి పేరేమిటి?" అని ఉపేంద్రు డడిగాడు.

"కుముదిని," అని రమేన్ జవాబు చెప్పాడు.

"ఆమె వితంతువా? లేక భర్త జీవించేవున్నాడా?"

"జీవించే వున్నాడు."

"అతను మీకు తెలుసా?"

"తెలుసు."

"ఎవ రతను?"

"ఇప్పుడు చెప్పటానికి వీల్లేదు."

"ఆమె ఎలాటిది?"

"చాలా మంచిది. ఆమె ప్రవర్తనలో వంక అన్నది లేదు."

"ఆమె ఇల్లు ఎక్కడ?"

"చెప్పటానికి వీల్లేదు."

"ఆమె భర్త యిల్లు?"

"అదీ చెప్పటానికి వీల్లేదు."

"ఈ ప్రశ్నలన్నీ నే నెందు కడుగుతున్నానని అడగరేం?"

"రెండు కారణాలవల్ల అడగలేదు. ఒకటి, నేను అడిగినా మీరు చెప్పరు."

"నిజమే. రెండోకారణం?"

"మీ రీ ప్రశ్నలు ఎందు కడిగారో నాకు తెలుసు."

"తెలుసునా! చెప్పండి, ఎందు కడిగాను?"

"చెప్పను."

"మీకు అంతా తెలుసునన్నమాటే. ఇంతకూ నాపథకం పారిందంటారా?"

"పారింది. కావలిస్తే కుముదినిని పిలిచి అడగండి."

"మీకు కుముదినిని గురించి తెలిసిందంతా కాగితంమీద రాసి సంతకం చేసి యివ్వగలరా?"

"ఇస్తాను. కాగితం కవరులో పెట్టి, సీలు చేసి, కుముదిని కిస్తాను. మీరు మీ ఊరు వెళ్ళేదాకా దాన్ని చదవరాదు. సరేనా?"



''అలాగే. నేను కుముదినిగురించి అనుకునేదీ, మీరు రాసేదీ ఒకేవిధంగా ఉంటుందా ?''

"ఉంటుంది.''

రమేన్ మరికొంత సేపు మాట్లాడి వెళ్ళిపోయాక. ఉపేంద్రుడు ఇందిరవద్దకు రాగానే, ఆమె, "ఏమి టీ మాటలు !'' అన్నది.

"అంతా విన్నావా ?''

"ఆ, ఏమి టిది ?"

''ఇదంతా ఇలాగే జరగాలి."

ఆరాత్రంతా అతను ఆమెకేసే చూస్తూ ఏదో ఆలోచించాడు. మర్నాడు ఆమెను అనేకప్రశ్నలు వేశాడు.

"నీభర్త బతికేఉన్నాట్ట. అతని ఊరు, పేరు ?"

"ఇప్పుడుకాదు, తరవాత చెబుతాను."

"అత నిప్పు డెక్కడున్నాడు ?"

"ఈ కలత్తాలోనే."

"ఇద్దరూ కలకత్తాలోనే ఉంటే, నువు అతనివద్ద ఎందుకు లేవు."

"నా కాయనతో పరిచయంలేదు."

"భార్యాభర్తలకు పరిచయం లేకపోవట మేమిటి ? వింత !"

"అందరికీ ఉంటుందా ? మీకు మీభార్యతో పరిచయం ఉందా ?"

"ఆ దొంగలమూలాన అలా జరిగిపోయింది."

"అలాటి దుర్ఘటనలు ఎక్కడైనా జరగవచ్చుగద !"

"సరే _ నీపైన నీభర్త వ్యాజ్యం తీసుకువచ్చే అవకాశం ఉందా ?"

"అది నాచేతిలో ఉంది. నేను వెళ్ళి ఆయన పరిచయం చేసుకోవాలిగా ! ఆ తరవాత ఏం జరిగేదీ ఎలా చెప్పటం ?"

"నువు చాలా తెలివిగలదానివి. నీకు ఉన్నసంగతంతా చెబుతాను. నే నిప్పు డింటికి పోవాలి. పోతే వెంటనే తిరిగి రాలేకపోవచ్చు. ని న్నిక్కడ వదిలివెళ్ళటం నాకు ప్రాణంమీదికి వచ్చిన ట్టున్నది," అన్నా డతను.

"అది నా ప్రారబ్ధం !" అన్న దామె, పైకి నవ్వుతున్నా, గుండెలు గొంతుకలో కొట్టుకుంటూ.

"నిన్ను నావెంటే తీసుకుపోతాను."

"న న్నేమని పరిచయం చేస్తారు. నేను ఇందిరననీ, వకీలుగారింట దొరికినాననీ మీవాళ్ళతో చెబుతారా ?"

అతను పెద్దకళ్ళు చేసి ఆమెకేసి వింతగా చూస్తూ, "నువు ఎవరు ?" అన్నాడు.

"ఏం ? ఎందుకలా అడుగుతారు ? అన్న దామె.

"నీకు ఇందిరపేరు ఎలా తెలుసు ? నేను నామనసులో అనుకున్నమాట నీ కెలా తెలిసింది ? నువు మనిషివేనా, లేక అమానుషశక్తివా ?" అన్నా డతను.

"అది తరవాత చెబుతానుగాని, ముందు ఓసందేహం తీర్చండి. మీభార్య తిరిగివచ్చినా ఏలుకోనని మాట ఇచ్చారుగదా ! ఇపుడు నన్ను తీసుకుపోయి ఇందిరగా

ఎలా పరిచయం చేద్దామనుకుంటున్నారు ? ఆమె జాతిని కోల్పోయిందన్న అభ్యం తరం ఉండనేఉంటుందిగా ?"

"ఇందిర జాతిభ్రష్టురా లయిందని ఎవరూ అనుకోవడంలేదు. ఆ దొంగలు అందరూ పట్టుబడిపోయారు. వాళ్ళు ఆమె



వస్తువులు తీసుకున్నామనీ, ఆమెజోలికి పోలేదనీ అన్నారు. కాని ఇందిరజాడ దొరకలేదు.''

''అయితే ఇంక ఆలోచన దేనికి ? భయ మేముందీ ?"

"నువు ఇందిరవు కాదని ఎవరైనా పోలిస్తే?"

"మీ ఇంట్లోవా శ్ళెవరికీ ఇందిర ఎలా ఉండేదీ తెలీదు. పదకొండేళ్ళ పిల్లగా వా శ్ళామెను చూశారు.''

"కాని అసలు ఇందిర ఎప్పటికైనా వస్తే నువ్వు దొరికిపోతావు."

ఇందిర చిన్నగా నవ్వి, ''మీ రింతకుముందు నే నెవరి నని అడిగారు; చెబుతాను. నేను మనిషినికాను. నాకు కామరూపశక్తి ఉన్నది. ఎక్కడికైనా వెళ్ళగలను. ఏమైనా చెయ్యగలను. నేను విద్యాధరిని; నేను మహామాయకు చిన్న అపచారం చేసి, శాపం పొంది, ఈ మానవరూపం ధరించవలసివచ్చింది. నా శాపం తొలగిపోనున్నది."

"నిజమో, కాదో తేల్చుకుంటాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పు. నా భార్య పేరు చెప్పావు. ఆమె తండ్రిపే రేమిటి?"

"హరమోహనదత్తుడు."

"వారి యి ల్లెక్కడ?"

"మహేశ్‌పూర్."

"వారి ఇంటి ముఖద్వారం ఎటుంటుంది?"

"దక్షిణంగా. అది సింహద్వారం. రెండుపక్కలా రెండు సింహాలు."

"ఆయన కెందరు కొడుకులు?"

''ఒక్కడే. వసంతకుమార్."

''ఆడపిల్ల లెందరు?"

''ఇద్దరు. ఇందిరా, కామినీ.''

"వా రింటిదగ్గిర సరస్సేమైనా ఉన్నదా?''

"ఉన్నది. దేవీదీఘి. అందులో కమలా లుంటాయి."

ఇలాగే అత నడిగిన ప్రశ్న లన్నిటికీ సరియైన సమాధానాలు వచ్చాయి. పెళ్ళి కాగానే అతను తనను ఒంటరిగా కలుసుకున్నప్పటి సంభాషణకూడా ఆమె చెప్పింది.

"నువే ఇందిరవయి ఉండాలి. లేదా అతీతశక్తివై ఉండాలి. నువే ఇందిరవైతే నా అదృష్టం అడిగావూ?'' అన్నా డతను.

''ముందు మహేశ్‌పూర్ పోదాం. అక్కడ ఈ చిక్కంతా విడిపోతుంది.'' అన్నది ఇందిర.

"రేపే బయలుదేరుదాం. నేను కాలాదీఘీదగ్గర ఆగిపోయి, నిన్ను మహేశ్పూర్ పంపి, రెండురోజుల అనంతరం వచ్చి కలుసుకుంటాను. కాని ఒక్కటి గుర్తుంచుకో – నువు ఇందిరవో, కుముదినివో, విద్యాధరివో, ఏదైనా కానీగాక, నేను మాత్రం నిన్ను విడిచి బతకలేను," అన్నా డతను.

నా శాపం తొలిగిపోగానే నేను మీదాన్నే అవుతాను. నాకు మీరు ప్రాణంకన్న కూడా ఎక్కువ," అన్నది ఇందిర.

రమేన్ వచ్చి, ఉపేంద్రుడు చూస్తుండగా, ఒక సీలువేసిన కవరును ఇందిర చేతి కిచ్చాడు. అతను వెళ్ళిపోతూ, "సుభాషిణికి ఏం చెప్పను?" అని ఆమె నడిగాడు.

"రేపు మహేశ్పూర్ వెళుతున్నానని చెప్పండి. అక్కడగాని నాకు శాప విమోచనం కలగదు," అన్నది ఇందిర.

ఉపేంద్రుడు రమేన్‌తోసహా బయటికి వెళ్ళి, "మీకు శాకినీ, ఢాకినీ మొదలైన వాటిల్లో నమ్మకం ఉందా?" అని అడిగాడు.

రమేన్ కొంచెం సంతోషించి, "ఉందనే అనొచ్చు. కుముదిని శాపగ్రస్తని అంటుంది నాభార్య," అన్నాడు.

ఉపేంద్రుడు దీనంగా, "కుముదినే ఇందరేమో మీవాళ్ళను కాస్త అడిగి కనుక్కుందురూ!" అని వేడుకున్నాడు.

రమేన్ నవ్వి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ కలకత్తానుంచి బయలుదేరారు. కాలాదీఘీదగ్గిర ఇందిరను మహేశ్ పూర్ పంపి, ఉపేంద్రుడు తనగ్రామంవెళ్లాడు. తనవెంట రక్షకులుగా వచ్చిన మనుషులను ఊరిబయటే వదిలేసి, ఇందిర కాలినడకన ఇల్లు చేరుకుని, తండ్రి కనిపించగానే పాదాలకు నమస్కారం చేసింది.

తరవాత ఇంటిల్లిపాతీ ఆమెను, "ఇన్నాళ్ళు ఎక్కడున్నావు? ఏమయావు?" అని అడిగారు. ఆమె కొన్నివిషయాలు చెప్పింది; అన్నీ చెప్పలేదు. తనభర్త రెండురోజుల్లో వస్తున్నట్టు చెప్పేసింది; కామినికిమాత్రం అంతా పూసగుచ్చినట్టు చెప్పేసింది.

తరవాత ఉపేంద్రుడు వచ్చాడు. ఇందిరమాత్రం అతనిఎదటికి రాలేదు. ఇందిర వచ్చినసంగతి ఎవరూ అతనితో అనలేదు. అతనై అడగలేకపోయాడు.

చివరకు అతను సాహసించి కామినిని, "మీఅక్క ఎక్కడ ?" అని అడిగాడు.

"ఎక్కడ ఉందో ఎలా తెలుస్తుంది ?" అన్నది కామిని.

"కుముదిని అనే మనిషిగాని ఇక్కడికి వచ్చిందా ?" అని అతను మళ్ళీ అడిగాడు.

"కుముదిని ఎవరో నాకు తెలియదు. ఎవరోఆవిడ పెద్ద మేనా ఎక్కివచ్చింది. మహాభైరవి ఆలయంలోకి వెళ్ళి దేవికి ప్రణామం చేసింది. ఒక్కసారిగా ఆకాశమంతా మబ్బులుపట్టింది. ఉరుములు ! మెరుపులు ! జోరున వాన ! ఆ సమయంలో ఆ వచ్చినావిడ త్రిశూలం పట్టుకుని ఆకాశంలోకి సర్రున ఎగిరిపోయింది."

"కుముదిని మాయమైనచోటు నేనూ చూస్తాను."

"సరే; చీకటిగా ఉంది; లాంతరు తెస్తా," అంటూ కామిని అక్కడగ్గిరికి వచ్చి, "ముందు నువు పద! తరవాత నేను బావను అక్కడికి తీసికొస్తాను." అన్నది.

ఇందిర ఆలయంలోకి వెళ్ళి ఒకపక్కగా కూర్చున్నది. కామిని వెంట వచ్చిన ఉపేంద్రుడు ఆమెను చూడగానే ఆమెదగ్గిర కూలిపోయి, "కుముదినీ! నువు నావెంట రాకపోతే ఆత్మహత్య చేసుకుంటాను," అంటూ ఏడవసాగాడు.

కామిని ఇందిరతో, "నువు వెళ్ళిపో అక్కా ! నిన్ను బావ గుర్తించటంలేదు. నిన్ను చూసి ఎవరో కుముదిని అనుకుంటున్నాడు." అన్నది.

ఉపేంద్రుడు మతిపోయినట్టుగా, "అక్క ఎవరు ?" అని అడిగాడు.

"మా అక్క - ఇందిర; ఎప్పుడూ ఆ పేరే వినలేదా ?" అంటూ కామిని ఇందిర చెయ్యి పట్టుకుని పరుగుతీసింది.

ఉపేంద్రుడు వాళ్ళ వెనకగా పరిగెత్తుతూ పడిపోయాడు, ఇద్దరూ వెనక్కి వచ్చి, అతన్ని లేపారు.

"మేం విద్యాధరులం మిమ్మల్ని కాపాడటానికి వచ్చాం," అన్నది కామిని.

ఇద్దరూ అతన్ని పడకటింట్లోకి తీసుకుపోయి, మంచంమీద పడుకోబెట్టారు. అతను ఇందిరను తానకేసి లాక్కున్నాడు; కామిని పారిపోయింది.

ఉపేంద్రుడి కిప్పుడు అంతా తెలిసిపోయింది. అతను మూడురోజులు అత్తవారింట మూడుక్షణాలుగా గడిపి, మనుగుడుపు గుడిచి, మేనాలో భార్యాసమేతుడై తన గ్రామానికి వెళ్ళాడు. అక్కడ రమేన్ సీలుకవరులో రాసిన వివరాలు బయట పడ్డాయి. అందరూ తృప్తి చెందారు.

ఇందిరకు సుభాషిణితో స్నేహం శాశ్వతంగా నిలిచిపోయింది. ఇందిరకు ఆమెఋణం ఒకంతట తీరేదికూడాకాదు.






"ప్రియమైన రాధాదేవీ,

చాలారోజులు తీక్షణంగా, తీవ్రంగా ఆలోచించినమీదట ఈ ఉత్తరం నీకు వ్రాస్తున్నాను. ఇన్నిరోజులుగా నీకు ఉత్తరాన్ని వ్రాసే ధైర్యాన్ని కూడదీసుకున్నాను. సహృదయంతో నా ఆవేదనను అర్థం చేసుకుంటావని ఆశిస్తాను...

రాధా!

ఈ ఉత్తరం చదివి నీకు చాలా కోపం రావచ్చని నేను అంచనా వేసుకుంటున్నాను. నీ కనుబొమలు పైకి లేచి, పెదిమలు బిగుసుకుపోయి, బుగ్గలన్నీ కెంపులుగా మారినపుడు...అబ్బ! నీవు కోపంలో ఎలా ఉంటావో ఊహించుకుంటేనే, పరవశించిపోతున్నాను. నీ అందం నన్ను పిచ్చివాడ్ని చేస్తోంది. భగవంతుడు తన ప్రజ్ఞనంతా వినియో

గించి నిన్ను మలిచాడు. అందాన్ని ఆరాధించే పుజారిని నేను...

రాధ, చేతిలోని ఉత్తరాన్ని, పర్రున చించి, ముక్కలను కాలికింద వేసి త్రొక్కింది. క్షణకాలం రంగారావుకేసి నమిలిమింగేసేటట్టు చూసింది.

ఉత్తరం వ్రాసింది నీవేనా.

కోపంలో ఉన్నప్పుడు రాధ అందాన్ని రకరకాలుగా ఊహించుకుని మురిసి పోయిన రంగారావు కొంచెం సేపు చేతులు నలుపుకున్నాడు. రాధ మొహం లోకి చూసే ధైర్యం లేక గుటకలు మ్రింగాడు.

నేనే!

"సిగ్గులేదూ ... ఏమిటిది?"

"లెటరు"... తడబడుతూ అన్నాడు రంగారావు.

"అది తెలుసు. నాకెందుకు వ్రాశావూ అని అడుగుతున్నాను?"

రంగారావు పూర్తిగా తెగింపు చేయ దలుచుకున్నాడు. చుట్టూ ఒకసారి కలయ జూచాడు. చుట్టూ ఉన్న జనం ఎవరూ అంతగా యీ విషయాల్ని పట్టించుకోక పోవడం గమనించి కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు.

"రాధా! ... నీ అందం నన్ను పిచ్చివాణ్ని చేస్తుంది. నేను నిన్ను వేళా కోళం చేయాలనిగాని, మోసం చేయాలని గాని వ్రాయలేదీ ఉత్తరం. నీ అందం నాకు కావాలి; లేకపోతే బ్రతకలేను. అందుకే ఆ ఉత్తరం వ్రాశాను. ఆపైన నీ యిష్టం." రంగారావు సాధ్యమైనంత మృదువుగా చెప్పాడు.

రంగారావు మాటలు విని రాధకు నవ్వు వచ్చింది.

"అదికాదోయ్ పూజారీ! అయితే నన్ను పెండ్లి చేసుకుంటానన్నమాట!"

"ఓ! అంతకంటేనా...రంగరావు. చాలా సంబరపడిపోయాడు...ఎలా... ఇదివరకే నీకు పెళ్ళయిందే! క్రీగంట చూస్తూ అంది రాధ...అది కేవలం నా కిష్టంలేని పెండ్లి...మానాన్న నాకు బల వంతంగా చేశాడు...మీరు ఊఁ అంటే రేపీపాటికి ఆమెకు విడాకులు సిద్ధం చేస్తాను" .. అది తన కో లెక్కలోనిది కాదన్నట్లు ధీమాగా పలికాడు రంగా రావు...

"ఎందుకంటే...రాధా...నీ అందం అలాంటిది... అంతే...యింక నే నేమీ చెప్పలేను."

"సర్సరే...ముందా విషయం చూడు...అంతవరకూ యిలాంటి అర్థం పర్థంలేనిపనులు చేయకు! నాకు బావుం డదు... మీ నాన్నావాళ్ళతో ఆస్తిపాస్తుల విషయంలోకూడా తెగతెంపులు చేసోక్కో వాలి సుమా! లేకుంటే బావుండదు..." రాధ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

అర్థంలేని మనుష్యులు ... ఇదంతా పైత్యం ... ఒకవిధంగా చెప్పాలంటే వెర్రి...విడాకు లిస్తాడా...ఇస్తాడు... వాళ్ళ మావ ఊరుకుంటాడా... మాటలు చెప్పగానే సరిపోయిం దేమిటి? రాధ ఆలోచించుకుంటూ...మధ్యమధ్య నవ్వు కుంటూ యింటికి పోయింది.

కొన్ని రోజులు గడిచిపోయాయి ...

రాత్రి పదిగంటల సుమారుకు తలుపు తడుతుంటే రాధ లేచి, తలుపు తీసి, బైట నుంచున్న రంగరావును చూసి నిర్ఘాంత పోయింది...రంగారావు చాలా ఖుషీగా కనిపించాడు.

"నువు కోరినట్లుగా దానికి విడాకు లిచ్చాను...యిదుగో, యిది కోర్టునుంచి మన వివాహంకోసం తెచ్చుకున్న పర్మీషను...

రాధ అచేతనంగా చూస్తూ - ఉండి పోయింది...

"ఇక ఆస్తిలో నావాటా మా నాన్నా వాళ్ళతో దెబ్బలాడి పూర్తిగా పంచేసు కున్నాను...మొత్తం వాటా నా పేర, నీ కోసం రిజిష్టరీ చేయించాను..." ఒక్కొ క్కటీ కాగితాలు తీసి విడమరుస్తూ చూపుతున్న రంగారావును చూసి రాధ విస్తుపోయింది...

"అందమైన ఓ రాధాదేవిగారూ! ఇపుడు మనపెండ్లికి అభ్యంతరా లేమిటి..." రంగారావు ముప్పిరిగొన్న సంతోషంతో అడిగాడు.

"అభ్యంతరాలా... ఒకటేమిటి, చాలా ఉన్నై! ముందువిషయం.. అసలు నా కిష్టంలేదు..." రాధ నీరసంగా మెల్లగా అంది...

"ఏం, ఎందుకూ...?"

"ఎందు కేమిటి...కట్టుకున్న భార్య కన్న కాస్త ఎర్రగా...అందంగా ఉన్న అమ్మాయి కనిపిస్తే భార్యకు విడాకు లిచ్చి, ఆస్తి పంచుకునివచ్చిన నీవు...రేపు నిన్ను నేను పెండ్లి చేసుకున్నాక...నాకన్న అందమైనవాళ్ళు కనిపిస్తే నన్ను చంప డానికయినా వెనుదీయవు...అమ్మో... మ వ్వంటే నా కసహ్యం... అంతకు మించి భయం..."

రాధ గ్రుక్క త్రిప్పుకుని తలుపు గట్టిగా, విసురుగా మూసివేసింది ...

రంగారావు దిగాలుపడి స్థాణువులా నుంచుండిపోయాడు ... చేతిలోని కాగి తాలు గాలికి రెపరెప లాడాయి.




(గత సంచిక తరువాయి)

"నిజంగా ? అబ్బ ! అంత ధైర్యంగా అందా మాలతి ?'' అంది ఆశ్చ ర్యంగా శ్యామల.

శంకరం నవ్వుతూ చెప్పాడు— "నిజంగా అంది. మీలాగే నేనూ ఆశ్చర్యపడ్డాను. అసలు మాలతి మనసులోకి ఆ వూహా వచ్చినందుకే విస్తుపోయాను.''

"మీ వుత్తరాలధోరణి చూస్తే నా కేదో అనుమానం వచ్చింది." శ్యామల శంకరం మొహంలోకి తేరి పారచూస్తూ, నవ్వుతూ అడిగింది— "మీకుకూడా ఈ వుద్దేశ్యం వుంది కదూ ? నిజం చెప్పండి."

శంకరం కొంచెం సంకోచించాడు— ''మీ దగ్గిర దాచుకోవటాని కేముంది? మొట్ట మొదటిసారి నేను వెన్నెల్లో కూర్చుని బుల్ బుల్ వాయించుకుంటుంటే మాలతి వచ్చింది. అప్పటి కా అమ్మాయిగురించి నా కేమీ తెలీదు. ఎంతో అందంగా నిర్మలంగా వుందను కున్నాను. ఎందుకో నా కో మంచి అభిప్రాయం కలిగింది. మాలతి పరిస్థితి తెలిసిం తర్వాత నా అభిమానం మరీ ఎక్కువైంది. ఆ అమ్మాయికి కొంచెం సన్నిహితంగా వెళ్ళి ఓదార్చా లని పించింది. నేనంటే మంచిభావం పెట్టుకుని నాతో పరిచయం పెంచుకుంది. ఇదంతా మీకు తెలిసిందే.

నిజం చెప్పేస్తాను. మాలతిని గురించి ఆలోచిస్తూ ఎన్నోరోజులు పిచ్చిగా గడిపేశాను. నా కిలాంటి వుద్దేశ్యం వుందని ఆ అమ్మాయి కేమాత్రం తెలిసినా నన్నేదో శత్రువుని చూసినట్టు చూస్తుందని భయపడ్డాను. ఆ అమ్మాయికి వాళ్ళ బావ పట్ల ఎంత ఇష్టమంటే... ఆ ప్రేమకి అవధుల్లేవు. గతంలో జ్ఞాపకాలని తల్చుకుంటూ మిగిలిన జీవితమంతా నిర్వికారంగా గడిపగల్గేంత శక్తి

వుంది. ఎన్నోసార్లు తర్కవితర్కాలు పెట్టుకున్నాను. నా అభిప్రాయం అర్థం చేయాలని ప్రయత్నించాను. నా వశం కాలేదు. చివరికి మొన్న... చెప్పానుగా?... సంభ్రమంతో తల మున్కలైపోయాను. వెంటనే మీకు వుత్తరం రాద్దామనుకున్నాను. సరిగ్గా ఆనాడే మీ వుత్తరం వచ్చింది – రెండు రోజుల్లో వస్తున్నానని. మీతో స్వయంగా మాట్లాడాలని వుత్తరం మానేశాను.''

శ్యామల శ్రద్ధగా వింది శంకరం మాటలు–అనుమానాస్పదంగాచూస్తూ అంది – "మిమ్మల్ని నేను శంకించటం లేదు, కానీ... ఒక్కమాట చెప్పండి. మాలతంటే మీ కెందు కంత యిష్టం? అందంగా వుంటుందనా?''

శంకరం ఎటోచూస్తూ ఆలోచించాడు – "అందంగా వుంటంకూడా ఒక కారణమే గానీ– నే నిష్టపడేది అందుకే కాదు. నన్ను మీరంతా పెళ్ళి చేసుకో మంటున్నారు. నాకూ చేసుకోవాలనే వుంది. మీరు కొంత మంది పిల్లల్ని చూశారు – చదువుకున్న వాళ్ళనీ, అందమైన వాళ్ళనీ.

"'ఏం? మాలతీ అందంగానే వుంది. మాలతీ చదువుకుంది. నా కన్నా చిన్నది; దారుణమైన కష్టానికి గురై వుంది. నేను పెళ్ళి చేసుకుంటే మాలతినే ఎందుకు చేసుకోకూడదూ?' ఈ ప్రశ్న నా మనసులో ఏనాడో తలెత్తింది. దాన్ని నేను అణుచుకోలేదు. 'మాలతి అంటే అసలు నీ కెందుకంత యిష్టం,' అన్నారు కదూ! ఆ అమ్మాయి మన స్తత్వం నా కెంతో నచ్చిందండి! తనను తను ఆహుతి చేసుకుని నమ్మిన వాళ్ళను ప్రేమించే గుణం వుంది. ఒక స్త్రీ మనసులో అపురూపమైన స్థానం దొరకటంకన్న మగవాడికి కావలసిందేముంది? ఆ స్త్రీ భార్యే అయితే ఇక జీవితంలో కోరాల్సిం దేముంది? అలాంటి ప్రేమకోసం నేను ఏమైనా చెయ్యగలను, కానీ...''

"ఏమిటి?'' ఆత్రుతగా చూసింది శ్యామల.

"నా అనుమానం మిమ్మల్ని అడిగి తీర్చుకోవాలనే యింత వివరంగా చెప్తున్నాను. మాలతి వాళ్ళ బావని ప్రేమించిందనే అసూయ నా కెంత మాత్రం లేదు. కానీ రేపు నన్ను కూడా అంత గాఢంగా ప్రేమించగలదనే నమ్మకం నాకు కలగాలి. ఆ విశ్వాసం లేకపోతే మాత్రం నే నీ పెళ్ళి చేసుకోను. అందుకే నేను మాలతికి ఏ మాటా యివ్వలేదు. నా అభిప్రాయం ఏమిటో సూచనగా చెప్పి వచ్చేశాను.''

శంకరం శ్యామల కళ్ళలోకి గుచ్చి చూస్తూ ప్రాధేయతగా అన్నాడు – "మీరు బాగా ఆలోచించి మీ సలహా ఏమిటో చెప్పండి; నే నేం చెయ్యాలో ఒక నిర్ణయానికి వచ్చేస్తాను.''




శ్యామల విస్మయంగా చూసింది. ఎంతో కొత్త వ్యక్తిని చూస్తోన్నట్టు చూసింది కళ్ళు దించుకుని ఆరిచేతిలో గీతలు పరీక్షించుకుంటూ కూర్చుంది.

శంకరం కొంచెం సిగ్గుపడుతూనే అన్నాడు - "స్త్రీ హృదయపూర్వకంగా ఒకే ఒక పురుషుణ్ణి మాత్రమే ప్రేమించగలదంటారు. నిజమేనని నేనూ నమ్ముతున్నాను. మరి మాలతిని చేసుకుని... నేనేం అనుభవించాలి ?''

శ్యామల జడత్వం వదిలించుకుని తల ఎత్తింది - "నా మాటలమీద మీకు విశ్వాసం వుందా ?"

"అందుకే కదా నేనింతగా అడిగేది ?"

"నా అనుభవం ఏదైనా చెప్తే, మీరు ఎలాంటి అభ్యంతరాలూ లేకుండా మీ అభిప్రాయం మార్చుకుంటారా ?''

శంకరం కొంచెం నవ్వాడు - "మీరిలా ముందుకాళ్ళకు బంధా లేస్తే ఎలా ? మీ అనుభవానికి నా అభిప్రాయాన్ని తల్లక్రిందులు చేయగల్గేంత బలం వుండాలి."

శ్యామలకూడా చిరునవ్వు నవ్వింది- ''మీరు బొత్తిగా లాయర్ లా మాట్లాడేస్తున్నారు," అంది.

ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు కొంచెంసేపు. శ్యామల మొహంలో, కళ్ళలో ఎన్నడూ ఎరగని చిత్రమైన భావం ... సిగ్గులాంటిది ... ప్రేమలాంటిది...ఆత్మీయత లాంటిది చూడగలిగాడు శంకరం.

శ్యామల గంభీరంగా అంది - ''ఈ రహస్యం జన్మంతా నాతోనే దాచు

కుండా మనుకున్నాను; ఎప్పుడూ ఎవ్వ రికీ చెప్పకూడదనుకున్నాను; కానీ... ఇది నాకోసం కాదు...మీ కోసం బయటపెట్టక తప్పటం లేదు. మీ చేత ఒక మంచిపని చేయించా లంటే, మీకే నిజం చెప్పెయ్యాలి."

శంకరం అయోమయంగా శ్యామల గాంభీర్యాన్ని చూస్తూ కూర్చున్నాడు.

"నే నేం చెప్పినా మీరు సందేహాలు వెలిబుచ్చకుండా – ఎదురు ప్రశ్నలు వెయ్యకుండా వినండి; లేకపోతే నేను చెప్పలేనేమో!"

"అలాగే; నే నేమీ అడగను; చెప్పండి," అన్నాడు శంకరం, శ్యామల స్వరూపాన్ని కొత్తగా చూస్తూ

"నా చిన్నప్పుడు .. అంటే ... నాకు పదహారు సంవత్సరాల వయ స్సులో...మా ఇంట్లో ఒక ... బీద విద్యార్థి వుండేవాడు. అతన్ని నే నెంత ప్రేమించానో భగవంతుడి కొక్కడికే తెలుసు – అతని పేరు చెప్పటం నా కిష్టం లేదు. ఏదో మారు పేరు...పోనీ శంకరం...అంటాను.''

తృళ్ళిపడ్డాడు శంకరం. మాలతి మొహంలోకి చూడబోయి ఎంతో స్థయిర్యంతో ఆ కోరిక ఆపుకున్నాడు.

మాలతి చలించకుండా చెప్పటం మొదలుపెట్టింది. "శంకరాన్ని నేను సోదరుడిలా ప్రేమించలేదు; స్నేహి తుడిలా ప్రేమించలేదు; 'ఈ అబ్బాయి నన్ను పెళ్ళి చేసుకుంటే ఎంత బావుం టుందీ!' అనే వూహా ల్లల్లుకుంటూ– కలలు కంటూ – ప్రేమించాను."

శంకరం వినలే ననుకున్నాడు; ప్రమాన్పడి కూర్చున్నాడు.

''శంకరం నడిచి వస్తోంటే నాకు కన్నుల పండుగలా వుండేది. శంకరం మాట్లాడుతోంటే శంఖారవంలా విన్పించేది. శంకరం నవ్వుతూంటే నా కేదో తన్మయత్వం కల్గేది. 'శంకరం శంకరం...శంకరం...' అంటూ నా హృదయం ఎప్పుడూ తపించిపోయేది. శంకరం కంటి చూపుకోసం నాలో ప్రతి అణువూ ఎదురు తెన్నులు చూసింది."

శంకరం నిర్ఘాంతపోయాడు. అన్న దానమూ, వస్త్రదానమూ, విద్యా దానమూ చేసిన ఈ శ్యామల తనకు ప్రేమదానంకూడా చేసిన దేవతా? బలంగా రాబోయిన నిట్టూర్పుని శాంతపరిచి నిశ్శబ్దంగా కూర్చు న్నాడు శంకరం.

'' 'నిన్ను చూస్తే నా కేదో తన్మ యత్వం కలుగుతుంది శంకరం,' అని శంకరానికి చెప్పాలని నా మనసు వువ్విళ్ళూరేది. శంకరం ఏమంటాడో వినాలని ఆరాటపడేది. కానీ శంకరం అంటే నాకు వుత్త ప్రేమేగాదు, అపారమైన గౌరవంకూడా వుంది.

శంకరం ఎదట నేను ధైర్యం చెయ్య లేనంత పసిపిల్లనైపోయేదాన్ని. నా గురించి శంకరాని కేమీ చెప్పకుండా – శంకరం నా దగ్గిర ఎంతో వినయంగా మాట్లాడుతోంటే విచిత్రమైన అను భూతి పొందేదాన్ని.''

శంకరం పెదవులమీద చిన్న నవ్వు నిలిచింది; ఆసక్తిగా వింటూ వూరు కున్నాడు.

"నాకు మా నాన్నగారు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. శంకరం నా కలల్లో రాజకుమారుడని ఆయన కేం తెలుసు? తెలిస్తే ఆయన సంతో షిస్తారనే నమ్మకం నాకెంతమాత్రం లేదు. 'నాన్నా! నాకే సంబంధాలూ చూడద్దు. నేను శంకరాన్నే పెళ్ళి చేసుకుంటాను. మరో నాలుగేళ్ళాగి. శంకరం బాగా చదువుకున్న తర్వాత, మా పెళ్ళి చేయండి,' అని నాన్నగా రికి చెప్పేద్దామా అనుకున్నాను రెండు మూడుసార్లు. నా ఆవేశం నాలోనే ఆగిపోయింది. నేను ఏ విషయంలోనూ తొందరగా ఒక నిర్ణయానికి రాలేదు. నాలో నేను తర్జనభర్జన పడుతోంటే నా కోరిక ఎంత హాస్యాస్పదం అయి పోతుందో బాగా అర్థమైంది. ఆ మాట నేనంటే నాన్నగారు నన్నేమంటారో తెలియదుగానీ – సాధ్యమైనంత తొందరలో శంకరాన్ని పంపించేస్తారు. 'చూడు శంకరం! ఈ గది తప్పని సరిగా ఎవరికో యివ్వాల్సివచ్చింది. నువ్వెక్కడైనా బస చూసుకుంటే బావుంటుంది,' అంటారు. శంకరం... దేవుళ్లాంటి శంకరం... ఏమైపోతాడు ఆమాటలకి? నాన్నగారే తెగతెంపులు చేసేస్తే, శంకరానికి యిల్లేదీ? వాకి లేదీ? బట్టలేవీ? పుస్తకాలేవీ? చదు వేదీ? మళ్ళా వూరుమీద పడి చందాలు పోగుచేసుకుంటాడా? వారాలు అడుక్కుంటాడా? చదువే ధ్యేయంగా నిశ్చింతగా రోజులు గడిపే స్తున్నాడే! కల్పవృక్షంలాంటి ఆశ్ర యము దొరికిందని మురిసిపోతున్నాడే! అలాంటి శంకరాన్ని...నాన్నగార్ని నిర్మలంగా నమ్ముకున్న శంకరాన్ని నేను ప్రేమించి నవ్వులపాలు చెయ్యనా? ఆశ్రయం పోగొట్టి దిక్కు లేని పక్షిని చెయ్యనా? ఇంట్లోంచి పొమ్మంటే ఎక్కడికి పోతాడు? ఎలా చదువు సాగిస్తాడు? శంకరం అభివృద్ధి కన్న – శంకరం భవిష్యత్తుకన్న నేను కోరాల్సిం దేముంది? నా ప్రేమ శంక రానికి విషంలా తయారైతే అందులో అర్థ మేముంది?

"నేను శంకరాన్ని ఎంతో గాఢంగా ప్రేమించాను; కాబట్టి అతన్ని పెళ్ళి చేసుకోలేదు. ఆ వూహాలన్నీ శంకరం కోసం ... మనసులోంచి తుడిచివేసు కున్నాను. తియ్యని మైకంలాగా కలలలో శంకరంతో గంతులేసిన కాలం అయిపోయింది.

"నాన్నగారు కుదిర్చిన సంబంధం ఒప్పేసుకున్నాను."

శ్యామలని ఎన్నో ప్రశ్నలు వెయ్యాలన్న తహతహ కల్గింది శంకరానికి; నోరు మెదపలేక వూరుకున్నాడు.

శ్యామల శంకరం కళ్ళలోకి మృదువుగా చూసింది-"ఇక్కడ నన్ను మీరు విశ్వసించాలి. ప్రతీ చిన్నమాటా హృదయపూర్వకంగా చెప్తున్నాను.

"నేను ఎంతో సంతోషంగా పెళ్ళి చేసుకున్నాను. మనసులో ఏ మూలా శంకరంకోసం మధనపడలేదు. నా భర్తని ద్వేషించలేదు. ఎన్నో విధాల నాకు తగినవ్యక్తి లభించాడని ఎంతో తృప్తిపడ్డాను నన్ను నా భర్త మన సాంతా ప్రేమించాలని కోరుకున్నాను. నేనూ ఆయనన్ని హృదయపూర్వకంగా ప్రేమించాను. ఈ ప్రేమలో ఎలాంటి నిషిద్ధమూ లేదు. ఎలాంటి అరమరికలూ లేవు. ఎలాంటి ఎడబాటూ లేదు. మనసులు కలుపుకొని - జీవితాలు పంచుకుని - ఎంతో హాయిగా, తృప్తిగా, సుఖంగా కాపురం చేస్తున్నాం. సహవాస ఫలితమనీ - పిల్లల్ని కన్న అభిమానమనీ అనుకోవద్దు. ఈ ప్రేమాంకురం నా మనసులో నా పెళ్ళిలగ్నం పెట్టుకున్న నాడే నాటుకుపోయింది. పెళ్ళినాడూ ... శోభనంనాడూ ... కొత్తగా అత్తవారింటికి వెళ్ళిన నాడూ...పాప పుట్టిననాడూ...మరో నాడూ ... మరోనాడూ చిలువలూ, పలవలూ వేసి, చూస్తుండగానే మహావృక్షమై పోయింది - అలాని నేను శంకరాన్ని మర్చిపోలేదు. మర్చిపోవాలని ప్రయత్నించలేదు. ఎప్పుడైనా చిన్నప్పటి నా వూహాలోకం గుర్తువస్తే గాభరాపడను. తప్పు చేశానని పశ్చాత్తాప పడను. అనుభూతులన్నీ నిజమైనవైతే ప్రేమా నిజమైనదే. అది పుట్టటం నిజం, పెరగటం నిజం, అంతరించిపోవటంకూడా నిజం. చిన్నప్పుడు గుప్పెళ్ళనిండా తీసుకుని మట్టి తినటం ఎంత సహజమో, మనసుకి నచ్చిన వ్యక్తిని ప్రేమించటం అంత సహజం. ఎప్పుడో శంకరం అంటే నాకు కలిగిన ప్రేమ నేను శాశ్వతంగా కన్నుమూసే వరకూ నాలోనే వుంటుంది. అది నన్ను బాధించదు, వేధించదు. హద్దులు మీరదు; మా దాంపత్య జీవిత సౌఖ్యానికి ఏంతమాత్రమూ అడ్డు రాదు."

శంకరం వింటూ ముగ్ధుడయ్యాడు.

"స్త్రీ ఒక్క పురుషుణ్ణే హృదయ పూర్వకంగా ప్రేమిస్తుందని మీరన్నారే! అదే నిజమైతే నేను స్త్రీని కాకుండా పోవాలి. నన్ను మీరు విశ్వసిస్తే మీ అభిప్రాయాన్ని సవరించుకోవాలి. స్త్రీకి మానసికావేదనా, సంఘర్షణా అధికమే అయినా పరిస్థితినిబట్టి స్త్రీ అతిసున్నితంగా మనసు




మార్చేసుకోగలుగుతుంది. నమ్మిన దాన్ని మనసారా పూజిస్తుంది. అసలు ప్రేమకి స్త్రీ పురుష భేదం ఏమిటి? ఒక నిర్వచనం ఏది? హద్దు లనేవి ఎక్కడ?"

శంకరం మాట్లాడలేదు. కృతజ్ఞతతో మనస్సు పులకరిస్తోంది. చాలా సేపు యిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. తర్వాత శ్యామలే నవ్వుతూ పలకరించింది శంకరాన్ని — "మీరు నిజంగానే ప్రశ్నలు వెయ్యకుండా కూర్చున్నారే! మాలతి గురించి మీకేం అన్పిస్తోంది?" అంది.

శంకరం కమ్మటి కలలోంచి తేరుకున్నట్టు లేచి నిలబడ్డాడు; శ్యామలని చూడలేక కళ్లు దించుకున్నాడు. "మీ పాదాలమీద తల ఆన్చి నమస్కరించాలనిపిస్తోంది నాకు," అన్నాడు. శంకరం అంతరంగమంతా శ్యామలపట్ల ఆరాధనతో నిండిపోయింది.

శ్యామల నవ్వి "ఎందుకూ?" అంది.

"మీ పాదాలు పూజించటానికి కారణంకూడా ఎందుకు?" అన్నాడు శంకరం.

* * *

కృష్ణమూర్తివాళ్ళింట్లో పండుగలా వుంది. ఎవరి మొహం చూసినా సంతోషం వెల్లివిరుస్తోంది. శంకరం

కృష్ణమూర్తికి రాసినవుత్తరం క్రిందటి నాడే అందింది—"మాలతి మనస్ఫూర్తిగా అంగీకరిస్తే నేను మాలతిని పెళ్ళి చేసుకుంటాను; రేపుసాయంత్రం మీ యింటికి వస్తాను," అని రాశాడు.

ఉత్తరంలో సమాచారం విని యింటిల్లపాదీ నిర్ఘాంతపోయారు. ఎవరికివారే వుత్తరం స్వయంగా చూశారు. శంకరం అంటే వున్న సదభిప్రాయంతో ఆ వుత్తరం శంకరం నిజంగానే రాశాడని నమ్మక తప్ప లేదు.

కృష్ణమూర్తి శంకరం వుత్తరం చెల్లెలికి చూపిస్తూ—"ఇక నీ అదృష్టాన్ని నువ్వే నిర్ణయించుకోవాలి. నీ కెలా యిష్టమయితే అలా చెయ్యి. నీ భారం వదిలించుకోటానికి తాపత్రయ పడుతున్నానని కలలోకూడా అనుకోవద్దు. ఎలాంటి పరిస్థితుల్లోఅయినా నువ్వు నా చెల్లెలివే. వుత్తరం చూడు," అంటూ వుత్తరం మాలతి దగ్గిర పెట్టి వెళ్ళాడు.

"అతని కి బుద్ధి భగవంతుడు పుట్టించిందేగానీ, మానవమాత్రుల వల్ల కాదు. ఇక దాని అదృష్టం ఎలా వుందో!" అంది మాలతి తల్లి నిరాశ పడుతూ.

"మాలతీ! నీ కేం చెప్పాలో నాకు తోచటం లేదు గానీ నీ అంత అదృష్టవంతులు చాలా అరుదుగా వుంటారు," అంది మాలతి వదిన కాస్సేపు మాలతి దగ్గిర కూర్చుని లేస్తూ.

దేనికీ మాట్లాడలేదు మాలతి.

ఎవ్వరికీ జవాబు చెప్పలేదు. ఎవరి మట్టుకు వాళ్ళు తప్పుకున్నారు. సాయంత్రానికి శంకరం వస్తాడని ఎదురుచూడటం తప్పితే చేసే దేమీ కన్పించలేదు.

అందరి మనసుల్లోనూ ఆనందంగా వుంది. ఎవరో వచ్చి ఏదో శుభవార్త వినిపిస్తారని ఎదురుచూస్తోన్నంత వుత్కంఠగా వుంది.

రానే వచ్చాడు శంకరం.

ఎప్పటిలా ఏదో పుస్తకం పట్టుకుని వచ్చాడు. కృష్ణమూర్తిని చూసి నవ్వుతూ హాల్లోకొచ్చి కూర్చున్నాడు.

శంకరాన్ని కొత్తగా చూస్తోన్నట్టు తడబడ్డాడు కృష్ణమూర్తి. శంకరం చేతిలో పుస్తకం అందుకుని చూస్తూ కూర్చున్నాడు. శంకరం పేపరు విప్ప బోతోంటే...

"నిన్న...మీ వుత్తరం ..అందిందండీ!" అంటూ ప్రసక్తి ఎత్తాడు. "మాలతికి చూపించాను - ఏం జవాబు చెప్పలేదు. మీరే మాట్లాడితే బావుంటుందని మే మెవ్వరం అడగలేదు," అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి భార్య రెండు కప్పులతో కాఫీ తెచ్చింది.

శంకరం కాఫీ తాగుతూ లోకాభి

రామాయణం మాట్లాడాడు. ఇద్దరూ కాస్సేపు కబుర్లు చెప్పుకున్నారు.

"పదండి, నేనూ వస్తాను," అంటూ లేచాడు కృష్ణమూర్తి. హాల్లోంచి గదిలోకి వెళ్తూ - "మాలతీ! ఏం చేస్తున్నావ్ ? శంకరంగారొచ్చారు," అన్నాడు.

మాలతి చటుక్కున లేచింది - "రండి" అంది ఎంతో సహజంగా - "కూర్చోండి; నువ్వూ కూర్చో అన్నయ్యా!" అంది అన్నగార్ని చూస్తూ.

"ఫర్వాలేదు; నువ్వు శంకరం గారితో మాట్లాడుతూండు. నేనలా బజారుకెళ్ళి వచ్చేస్తాను. అమ్మ కూర లేవో కావాలని చెప్పింది ... మీరు కూర్చోండీ," అంటూ శంకరానికి కుర్చీ చూపించి బయటికి వెళ్లిపోయాడు కృష్ణమూర్తి.

శంకరం కూర్చున్నాడు.

మాలతి నించునేవుంది.

శంకరం మాలతిని చూశాడు. మిసమిసలాడే తెల్లని బట్టలతో - నిరాడంబరంగా - అందంగా దేవకన్యలా వుంది.

మాలతి భావాలు చదవాలని దీక్షగా చూశాడు శంకరం - "నా వుత్తరం మీరూచూశారా?" అన్నాడు మనసు విప్పి మాట కలుపుతూ.

"చూశాను," కళ్ళెత్తి శంకరాన్ని చూస్తూ అంది - "నేనంటే మీకు జాలి వుండచ్చు... ఈ సాహసం ఏమిటి ?"

శంకరం కొంచెం ఆశ్చర్యంగా చూశాడు - "జాలా ? ఎందుకూ ? మీ రెంతో దారుణమైన కష్టంలో వున్నానని కృంగిపోతున్నారుగానీ - ఇది ఎంతో సహజంగా కన్పిస్తోంది నాకు. జాలే అయితే అది మరోలా చూపించుకోవచ్చు. అయినా యిందులో సాహసాని కేముంది ?"

"ఇప్పు డిలాగే అనిపిస్తుంది. రేపు కలిసి బ్రతుకుతోన్నప్పుడుగానీ అసలు సమస్యలు ఎదురుకావు."

"చెప్పండి. అదంతా మాట్లాడు కోవాలనేగా మీ దగ్గిరికి వచ్చాను."

మాలతి కొంచెంసేపు మాట్లాడ లేదు. నెమ్మదిగా వచ్చి శంకరానికి దగ్గిరిగా నించుంది. "నా మనస్సులో లక్షాతొంభై అనుమానా లున్నాయి. అవన్నీ అడిగేస్తే మీ రేమైనా అను కుంటారా ?"

"అనుకోను. ఏమీ అనుకోను. ఒక్క అనుమానంకూడా దాచుకో కుండా నాకు చెప్పెయ్యండి."

"నేను మా బావను ఎలా మర్చి పోతా ననుకున్నారు ?"

"మర్చిపొమ్మని నే నన్నా నా ?"

తెల్లబోయింది మాలతి - "అయితే నే నింకా మాబావని తల్చుకుంటోంటే మీకు కష్టంగా వుండదా ?"

"ఉండదు. మా అమ్మ ఎప్పుడో పోయింది. నేను మర్చిపోయానా? మర్చిపొమ్మని మీరు అంటారా?"

"అదీ ఇదీ ఒకటికాదు."

"ఎందుక్కాదు. ప్రేమలో తార తమ్యం తప్పితే, ఫలితం ఒక్కటే. జీవితం సుళువుగా హాయిగా ముందుకు పోవాలంటే గతంలో జరిగిన కొన్ని సంగతులు మర్చిపోవాలి. ఆ మలుపు సహజంగానే వచ్చేస్తుంది. నేను చదువు కునేరోజుల్లో మా అమ్మని బాగా మర్చి పోయాను. లేకపోతే నా చదువు సాగ దని నాకు తెలుసు. మా అమ్మని మర్చి పోవాలని నన్ను ఎవరైనా శాసిస్తే నేను ఇంకా పట్టుదలతో ప్రతీక్షణమూ ధ్యానిస్తూ వుంటాను. అంతేనా?"

శంకరం మాటలు మాలతికి నమ్మ శక్యంగా లేవు. నిరుత్సాహమాటంగా మాట్లాడాలనిపించింది -

"ఎప్పుడైనా మా బావఫొటో నాకు చూడాలనిపిస్తే ఆల్బమ్ చూస్తూ కూర్చుంటాను. గతమంతా గుర్తువస్తే మా బావని ముద్దుకూడా పెట్టుకుం టాను. అదంతా మీరు చూస్తే?" అంది తిక్కగా.

శంకరానికి నవ్వు వచ్చింది - "ఎందుకు నన్నింత శంకిస్తున్నారు? మిమ్మల్ని పెళ్లి చేసుకోమని నన్నెవ రైనా ఆజ్ఞాపించారా? కట్టడి చేస్తు న్నారా? మీలో ఏ గుణం చూసి నేను ముగ్ధుణ్ణయ్యానో మీకు తెలీదా? అర్ధరాత్రి నిద్రలేపి, మా బావ కలలో కొచ్చాడని చెప్పండి; మీ నిజాయితీకి నేను శ్లాఘిస్తాను. వివరంగా ఆ కలంతా విని ఆనందిస్తాను; కానీ నా కోరికకూడా ఒకటి వుంది - నేను ప్రేమకీ, విశ్వాసానికీ దూరంగా బ్రతక లేను. వాటికోసమే మిమ్మల్ని నేను కోరుకుంటున్నాను. మీ హృదయాన్ని ఒకత్రాసుగా చేసి, అందులో మీ బావనీ నన్నూ తూచినప్పుడు, నాకు అన్యా యం జరిగితే నేను భరించలేను. అలాంటి విలువ నాకు యివ్వలేనప్పుడు మనం పెళ్లి చేసుకోవద్దు. నన్నే కాదు, మీరు ఎవర్నీ పెళ్లి చేసుకోవద్దు."

మాలతి స్థాణువులా ఐపోయింది. శంకరంలోని ఔన్నత్యం మాలతిని మూగదాన్ని చేసేసింది.

సంభ్రమంతో శంకరం కేసి చూస్తోన్న మాలతి కన్నుల్లో, మొహంలో ఎన్నడూ చూడని కాంతి చిందులాడింది.

శంకరం మృదువుగా - "ఈ సమ యంలో మౌనంగా నించున్నారు! మీ మన స్సేమిటో చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది?" అన్నాడు మాలతిని తదే కంగా చూస్తూ.

మాలతి మందహాసం చిందిస్తూ - సిగ్గుపడుతూ అంది - "నన్ను పెళ్లి చేసు కుంటానంటూనే ఎందు కలా మన్ని స్తున్నారు?"







శంకరం చిరునవ్వు నవ్వాడు. ఎంత చాతుర్యంగా చెప్పిందీ అంగీకారం! - "మరి ఏమని పిలవను? మాలా అననా మీ బావలా."

మాలతి కొంచెం కోపంగా చూసింది - "మా బావ ఒరవడి తప్పితే మీకో ప్రత్యేకత లేదా? ప్రతీ చిన్న విషయానికీ మా బావమా టెందుకూ?"

"ఏం? మీరే గుర్తు చేసుకుంటూ నన్నారుగా?"

"చేసుకుంటానో! మర్చిపోతానో! మీరు మాత్రం గుర్తు చెయ్యకూడదు. మా బావ దేవుడితో కలిసి దేవుడై పోయాడు. నే నింకా బ్రతికివున్నానని నాకు మిమ్మల్ని ప్రసాదించాడు. బావని దేవుడిస్థానంలో కూర్చోబెట్టి పువ్వులతో పూజిస్తాను. మిమ్మల్ని నా హృదయంలో ప్రతిష్ఠించుకుని మనసారా ప్రేమిస్తాను."

నిజంగా దేవతలా కన్పిస్తోన్న మాలతిని చూస్తూ తన్మయత్వంతో మూగవా డయ్యాడు శంకరం.

* * *

"మాలా!"

గదిలో మంచంమీద పడుకుని పేపరు చూస్తూ పిల్చాడు శంకరం.

అది నాలుగో పిలుపు. మాలతి వులుకూ పలుకూ లేదు. శంకరం పేపరు విసి రేసి లేచి వంటగదిలోకి వెళ్ళాడు.

మాలతి చూడబుల్‌గా వుంది. వంట లక్కపోజులో రోటిముందు కూర్చుని బరబరా పప్పు రుబ్బుతోంది. స్టౌమీద అన్నం పొంగబోతోంటే శంకరం గబ గబా వెళ్ళి మూత తీసి కింద పడేశాడు.

మాలతి రుబ్బటం ఆపి, మొగుణ్ణి చూస్తూ నవ్వింది.

శంకరం నాలుగుపక్కలా గాలించి, పీట తెచ్చుకుని రోటిదగ్గర కూర్చు న్నాడు - "నాకు శలవుకదా? ఇవన్నీ ఎందుకు పెట్టుకున్నావు చెప్పు?

"శలవే కాబట్టి గారెలు చేసిపెడితే తీరిగ్గా కూర్చుని తింటారనీ..."

"గారెలు తినకపోతే ఈ శెలవు గడుస్తుందో లేదో చూద్దామా?"

"పనిలోపని; అన్నం తినకపోతే ఇవ్వాళ బ్రతగ్గలమో లేదోకూడా చూద్దాం."

"చూద్దాం; ఎప్పుడు చూడలేక పోతే అప్పుడు గారెలతోసహా అరగిం చేద్దాం."

మాలతి నవ్వి - "చూడండి, ఇంత పనితో సతమత మౌతున్నాను కదా! మీరు నాకొంచెం సాయం చెయ్య్య కూడదూ?" అంది.

"చెప్పు, పప్పు రుబ్బనా? అన్నం వార్చనా? ఏం చెయ్యను?"

"అబ్బే! ఇంకా పెద్దసాయం. గదిలోకెళ్ళి కూర్చుని ఏదైనా చదువు కోండి; లేకపోతే స్త్రీకి జరిగే అన్యా యాన్ని గురించి ఆలోచిస్తూ పడు కోండి."

"సరిగ్గా జ్ఞాపకం చేశావ్. అసలు నిన్నందుకే పిల్చాను. ఇవ్వాళ పేపర్లో ఒక దారుణమైనవార్త పడింది. ఒక స్త్రీ పిల్లలకి విషం పెట్టి తనూ విషం తిని చచ్చిపోయిందట. కష్టాలు భరించ లేక అలా చేస్తున్నానని వుత్తరం రాసి పెట్టిందట."

"పాపం! చాలా ఘోరంగానే వుంది. పిల్లల్నికూడా చంపుకోటానికి అంత కష్టాలేం వచ్చిపడ్డాయో!"

"మాలా! నూటికి తొంభై మంది విషయంలో ఆడదాని కష్టాలకి ఏ కోణం నుంచి చూసినా - కారణం డబ్బే. నాకు తెలిసినంతవరకూ ప్రతీ స్త్రీ జీవితాన్ని స్టడీ చేస్తున్నాను. స్వంత ఆస్థి వున్నవాళ్ళూ - స్వంత సంపాదన వున్నవాళ్ళూ దర్జాగానే వున్నారు; కొంతైనా స్వేచ్ఛగా బ్రతకగలుగు తున్నారు. ఏదీ లేక ఒకరిమీద ఆధార పడి వుండేవాళ్ళకే ఇబ్బందులన్నీ."

మాలతి చిరాగ్గా చూసింది. "ఆధార పడటం అంటా రెందుకూ? ఆడది ఇల్లు చూసుకుంటుంది, మగవాడు బయట నుంచి సంపాదించి తెస్తాడు. ఎవరి కర్తవ్యం వాళ్ళదే. మగవాడు

మాత్రం మిగతా అన్ని విషయాలకీ ఆడదానిమీద ఆధారపడిలేడా?"

శంకరం తల అడ్డంగా తిప్పాడు. "లోకం అంతా ఇంత సున్నితంగా - ఇంత ధర్మబద్ధంగా ఆలోచించదు. అర్జన విషయమే ఘనంగా కన్పిస్తుంది గానీ, ఒక వ్యక్తి, జీవితమంతా ఇల్లు చూసుకుంటూ - వండి పెడుతూ - ప్రేమానురాగాలు పంచిపెడుతూ, ఇంట్లోవాళ్ళ శ్రేయస్సుకోసం గడపటం ఏమంత గొప్పగా తోచదు. అందుకే మగవాడు 'నేను నీ యింటి కొచ్చానా? నువ్వు నా యింటి కొచ్చావా? అక్కర్లేకపోతే పో!' అనేస్తాడు తేలిగ్గా. ఆ ఆడదానికికూడా ఆర్జించుకునే శక్తి వుంటే - పిల్లల్ని పెంచుకుంటూ తన కాళ్ళమీద తను నిలబడగలిగితే- అప్పుడెలా వుంటుందో ఆలోచించు."

"ఎవరి మానాన్న వాళ్ళు వుంటారు."

"అక్కడే పొరపడ్డావ్. అసలలాంటి పరిస్థితి ఎంతమాత్రం రాదు. ఒక భర్త భార్యని ప్రేమిస్తున్నాడే అనుకో! ఆ భార్యకే ఆస్తి సంపాదనా కూడా వుంటే ఆ ప్రేమతోపాటు ప్రత్యేకమైన విలువకూడా యిస్తాడు. తన అండ లేకపోయినా భార్య నిశ్చింతంలా బ్రతకగలదనే నమ్మకం వుంటే - 'వుంటే వుండు, పోతే పో!' అనలేడు. ఇది కేవలం భార్యాభర్తలకే సంబంధించింది కాదు. తండ్రీ కొడుకులకీ - అన్నదమ్ములకీ - ఎవరికైనా సరే; ఆర్థిక విలువ అంత గొప్పది. ఆడదానికికూడా మగవాడిలాగ ఏదో ఒక బ్రతుకుదెరువు వుంటే ఈ సమస్యలన్నీ సగానికిపైగా పరిష్కారం అయిపోతాయి."

"బ్రహ్మాండగా వుంది; ఇన్నాళ్ళకి ఆడదాని కష్టాలకి కారణం కనిపెట్టేశారు మీరు. ఇంకేం? సమస్యలన్నీ పరిష్కరించెయ్యండి."

"ఎవరి సమస్యలో నేనెలా పరిష్కరించగలను? నా యింటి సంగతీ - నా యిల్లాలి సంగతీ చూసుకుంటేచాలు."

"మీకు పుణ్యం వుంటుంది. నా ప్రాణాలమీద కేం తేకండి."

"అలా మొర్రోమంటే నే నేం పూరుకోను. రేపు కాలేజీలు తెరవగానే నువ్వు మళ్లా చేరి చదువుకోవాలి. అలా నీ కిష్టం లేకపోతే ట్యూషన్ పెట్టిస్తాను. నువ్వు మాత్రం బాగా చదువుకుని నాలుగక్షరం ముక్కలు నోట్లో వుంచుకోవాలి. ఏమో! నీ మొగుడు మాత్రం మగవాడుకాడా? 'నేను సంపాదిస్తున్నాను. నిన్ను పోషిస్తున్నాను.' అనే అతిశయం ఎప్పుడైనా పుడుతుందేమో శివుడికి."

మాలతి మింగేస్తున్నట్టు చూసింది శంకరాన్ని -" ఛీ! మీరు మనుషులు

కారు. నోరు తెరిస్తే తర్కమేగాని యింకేమీ మాట్లాడరు. అంత ఆత్మ విశ్వాసం లేని మీరు వూళ్ళో వాళ్ళందరికీ వుపన్యాసా లిస్తా రెందుకూ? మీరు పొమ్మంటే ఎందులోనన్నా పడి చస్తాగానీ వుద్యోగం చేసుకు బ్రతకటం కూడానా? చాలుగానీ వెళ్ళండి. నా కాలికీ చేతికీ అడ్డం తప్పితే మీరు నాకు చేసే నిర్వాకం ఏమీలేదు," అంటూ విరుచుకుపడింది.

శంకరం కోపంగా లేచాడు — "అసలు నువ్వు నన్ను అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకున్నావ్. వంటింటి నీ — రుబ్బురోటినీ మాత్రం గంటల తరబడీ కావిలించుక్కూర్చుంటావ్. ఈ అన్యాయానికి నీ మీద నేను కేసుపెట్టచ్చు. వంటింట్లో వున్న సరుకులన్నీ వండుకు తింటూ — ఇక్కడే మగ్గిపో," అంటూ విసురుగా వెళ్లిపోయాడు.

మాలతి నవ్వి నవ్వి ... నవ్వలేక నీరసపడిపోయింది.

* * *

"శివశంకరం, బి. ఎ., బి. ఎల్.,
అడ్వకేట్."

గోడమీద కనిపిస్తోన్న బోర్డు చూస్తూ చాలాసేపట్నుంచీ గేటు దగ్గరే తచ్చాడుతున్నాడు ముసలి శేషయ్య. అప్పుడప్పుడూ మూసివున్న గేటు డిజైన్‌లోనుంచి వాకిట్లోకి పిరికి చూపులు చూస్తున్నాడు. గేటుదగ్గిర్నుంచి వీధిగుమ్మం వరకూ నడవటానికి బారెడు వెడల్పు దారి తప్పితే రెండువైపులా దట్టంగా చెట్లు పెరిగి గొడుగు కప్పినట్టు వుంది. చెట్లలోంచి ఆకాశం తొంగితొంగి చూస్తోంది. తనని చూసి ఆకులన్నీ గుసగుసలాడు కుంటున్నా యనిపించింది శేషయ్యకి. ఆకులు గలగల గాలికి కదులుతూ — చెట్లు వయ్యారంగా వూగుతూ ప్రశాంతంగా, పచ్చగా, కన్నుల పండుగలా వుంది పెరడు. దేవతలుండే చోటులా వుంది యిల్లు.

శేషయ్య దగ్గుతూ గేటుపక్కన గోడవారన నిలబడ్డాడు. ఎముకలు బయటపడ్డ శరీరంమీద జారిపోతున్న చిరుగుల తుండుగుడ్డ సర్ది కప్పుకు న్నాడు. మొలకి చుట్టుకున్న పంచె నల్లగా మాసి చీలికలూ, వాలికలూ వ్రేళ్ళాడుతున్నాయి. జుట్టూ, గడ్డం పెరిగి మనిషిపోలికలు మరుగుపడి పోతున్నాయి. గాజుగుడ్లలా కాంతి లేని కళ్ళతో యింట్లో కన్పిస్తోన్నంత వరకూ వెర్రిచూపులు చూస్తున్నాడు.

నీరెండ జారి కనుచీకటి అలుముకో సాగింది. చివరికి — తెగించినవాడిలా శేషయ్య వణికే చేతులతో గేటు తెరిచాడు. తడబడుతూ వాకిట్లో అడుగు మోపాడు. బలవంతంగా దగ్గు అణుచుకుంటూ వుక్కిరి బిక్కిరౌతూ గంటకో అడుగు వేస్తూ నడిచివెళ్ళాడు.




వరండాలో నిలబడి చూస్తోనేవుంది మాలతి జడ అల్లుకుంటూ. దూరంగా ఆగిపోయాడు శేషయ్య.

మాలతి గబగబా ముందుకు వచ్చి–"ఫర్వాలేదు, రండి. అలా బల్లమీద కూర్చోండి. ప్లీడరుగారికోసమేనా?" అంది. మాలతిని ఎగాదిగా చూశాడు శేషయ్య. గులాబీరంగు జరీచీర కట్టుకొంది మాలతి. తెల్లటి తెలుపు. పొడుగాటి జడ. పెద్ద కళ్ళు. అందంగా బొమ్మలా, పూసిన తీగలా వుంది. శేషయ్య లోతుకు పోయిన కళ్ళతో సంభ్రమంగా చూస్తూ – నోరు పెగిలి మాట రాక, తటపటాయిస్తూనే తల తాటించాడు.

మాలతి లోపలి కెళ్ళిపోయింది. శేషయ్య ఒక్కడూ వరండాలో కూర్చుని వున్నాడు. ఆశగా ఇంట్లోకి చూడబోయాడు. గుమ్మం తెరదాటి ఏమీ కన్పించలేదు. వరండాకి నాలుగు వైపులా కుర్చీలూ బెంచీలూ పొందిగ్గా వేసివున్నాయి.

హాయిగా చల్లగా చెట్లలోంచి గాలి వీస్తోంది.

శేషయ్య గుండెలు బరువెక్కి వుక్కిరి బిక్కిరిగా దగ్గు రాబోయింది.

అతికష్టంమీద ఆపుకున్నాడు. ఆపుకో లేక సతమత మయ్యాడు.

తెర తీసుకుని బయటికి వచ్చిన శంకరం... తెల్లబోయాడు ... బెంచీ మీద కూర్చుని ఖంగు ఖంగుమని దగ్గుతోన్న వ్యక్తిని ... తొందరగానే పోల్చగలిగాడు. గుడ్డలుచిరిగి పీలికలై - జుట్టు పెరిగి జడలుకట్టి - చిక్కి శల్యమై జీవచ్ఛవంలా ... మొహం ఎత్తి వెర్రి చూపులు చూస్తున్న మనిషిని ... సూటిగా చూశాడు శంకరం.

శంకరంమొహంలో కళ మారింది. చూపుల్లో తీక్షత పుట్టింది. ఒక్కక్షణం నిదానంగా చూశాడు.

చటుక్కున వెనక్కు తిరిగాడు - "మాలా! ఆయన ఎందుకు వచ్చాడో కనుక్కో," అన్నాడు.

తెల్లబోయింది మాలతి. భర్త ప్రవర్తన అమితాశ్చర్యం కల్గించింది. అయోమయంగా బెంచీమీద కూర్చున్న వృద్ధుణ్ణి చూసింది.

న్యాయాధికారి చూసిన నేరస్తుడిలా బిత్తరపోతూ మనుషులకి మొహం వాచినట్లు వెర్రివాడిలా చూశాడు శంకరాన్ని. తెల్లటి బట్టలతో ఆరోగ్యంగా అందంగా కనిపించాడు చెట్టంత కొడుకు - కొడుకు తనని పోల్చలేక పోయాడా? - శేషయ్య వళ్ళంతా వణకటం మొదలెట్టింది. కడుపులోంచి గుబులు బయల్దేరింది. బెంచీమీదనుంచి లేవాలని ప్రయత్నిస్తూ శంకరాన్ని దీనంగా చూస్తూ అన్నాడు -

"శివా ... నేనురా! ... మీ ... అయ్యని." శంకరం గుండె భగ్గుమంది. చూస్తోండగానే శంకరం కళ్ళు ఎరుపెక్కాయి. మొహంనిండా చెమట పట్టింది. మనిషి దారుణమైన వుద్వేగంతో కంపిస్తున్నాడు - శేషయ్యని తీక్షణంగాచూస్తూ అన్నాడు - "శివా! ... శివా నీ కేమౌతాడు?...ఎప్పుడు గుర్తువచ్చాడు?... శివా ఎంత నాశన మయాడో చూద్దామని వచ్చావా?"

కొయ్యబారిపోయాడు శేషయ్య. కట్టెలాంటి చేతులతో బెంచీ గట్టిగా పట్టుకుని మొహం ఎత్తి రాయిలా కూర్చున్నాడు.

శంకరం ఒక్కఅడుగు ముందుకు వేసి శేషయ్యవైపు చెయ్యి చాపుతూ కఠినంగా అన్నాడు -

"నువ్వు... నా తండ్రివా? నీ అంత రాత్మ సిగ్గుతో చచ్చిపోవటంలేదూ! నా వూహ తెల్సింతర్వాత ఒక్క ఘడియైనా... ఒక్క క్షణమైనా... నువ్వు నాకు తండ్రి వనిపించావా? తండ్రిలా ప్రేమించావా? అమ్మ ఆదరం తప్పితే నా కేమైనా దక్కనిచ్చావా? తల్లి చచ్చినవాణ్ణి...ఒక్కసారైనా కళ్ళారా చూసి - నోరారా పిల్చి చేరదీశావా? నీ యింట్లో కడుపునిండా తిండిలేక - ఆదరించే నాథుడ్లేక - బికారినై

తిరిగానే! నా దుఃఖం నాలో దాచుకుని నీముందు చెయ్యిచాచి చదువుకుంటా నని ముష్టి అడిగానే! ఏమన్నావ్? అపహాస్యం చేసి - అడుక్కుతినమని ఆశీర్వదించి పంపించావు. గుర్తులేదా? ఈశివ ఎవ డనుకున్నావు? ఇంతకాలం ఏమయ్యా డనుకున్నావ్?" తరుము కొస్తోన్న జ్ఞాపకాలతో శంకరం తల మున్కలయ్యాడు-కోపోద్రేకం విజృంభించి శంకరాన్ని పూర్తిగా ముంచెత్తింది - శేషయ్యకేసి నిర్మొహమాటంగా సూటిగా చూశాడు - "నిన్ను నమ్ముకున్న భార్యని - నువ్వు పెట్టినహింస - అడుగడుగునా నాతల్లి అనుభవించిన క్షోభ, ఈ పాతికేళ్ళకే మర్చిపోయా ననుకున్నావా?-నాతల్లి చావుబ్రతుకులమధ్య కొట్టుకులాడుతూ మందూ మాకూ లేక పడివుంటే - నీ వుంపుడుకత్తెని - నీచేతులతో బండి కట్టుకుని అపురూపంగా జాతరకి తీసి కెళ్ళావు. నీ చేష్టలకి కుళ్ళి కుళ్ళి చచ్చిపోయింది నా తల్లి. పెళ్ళాం పోయిందని వైరాగ్యం నటించి ఒక్కగా నొక్క ఆడపిల్లని - పాలుతాగే పసి కూనని ... ప్రాణాంతో పాతేసిన తండ్రివి నువ్వు. ఎన్ని గుర్తుచెయ్య మంటావు? ఏది మర్చిపొమ్మంటావు?"

శేషయ్య ఎప్పుడో తల దించేసు కున్నాడు.

మాలతి నిర్ఘాంతపడి చూస్తోంది తండ్రీకొడుకుల్ని. మళ్ళా అన్నాడు శంకరం - రెట్టిస్తూ - "నువ్వు నమ్మిన వాళ్ళు నిన్ను మోసంచేసి - ఆస్తిఅంతా అప్పులపాలై - వృద్ధాప్యం మీదపడి - తెగుళ్ళు తినేస్తుంటే - ఇవాళ నీకు కొడుకు కనిపించాడా? నీ తండ్రి నంటూ బయల్దేరివచ్చావా? బాధ్యతలు వదిలేసుకున్న నీకు హక్కులుకోరే అర్హ తెలావచ్చింది? - ఆనాడు నువ్వు నిరాదరంగా వెళ్ళగొడితే ఏకాకిగా - అనాధుడిగా - లోకంలో అడుగు పెట్టాను. ఈ భవిష్యత్తంతా నా కష్టార్జితం! నా చదువుసంధ్యల్లో, నా సిరి సంపదల్లో అణువణువూ నా స్వార్జితం! నా సుఖాన్నీ సంతోషాన్నీ నీకుమాత్రం పంచియివ్వను. నా అంతస్థుల నీడలో కూడా నిన్ను నిలబడనివ్వను. మన మధ్య తండ్రీకొడుకుల బాంధవ్యం ఏనాడో తెగిపోయింది."

శేషయ్య వళ్ళంతా వణకటం స్పష్టంగా కన్పిస్తోంది - "నాయనా ... శివా ...!" అస్పష్టంగా పిలుస్తూ లేవబోయాడు.

శంకరం స్థాణువులా నించున్నాడు- సూటిగాచూస్తూ చెప్పాడు - "నువ్వు నన్ను పిలవాలంటే 'శంకరంగారూ' అనాలి. 'శివా' అని నన్ను పిలవగలిగే వాడు వీరన్నఒక్కడే. వాడు నన్ను పెంచినతండ్రి; జ్ఞాపకం పెట్టుకో. నన్ను శివా అని ఎప్పుడూ పిలవకు."

శేషయ్య తల ఎత్తలేకపోయాడు.

మాలతికి సర్వం అర్థమైంది. చెమర్చిన కళ్ళతో భర్తని చూసింది. భగవంతుడి ఎదట మోకరిల్లిన భక్తురాలిలా ప్రాధేయతగా నిలబడింది - "ఆయన జరిగిందాని కెంతో బాధ పడుతూనే మనయింటి కొచ్చారు. ఈ వృద్ధాప్యంలో ఆయన్ని తిరస్కరించటం మీకు ధర్మంకాదు."

శంకరం తల అడ్డంగా తిప్పాడు; నిర్లక్ష్యంగా అన్నాడు - "ఈ పశ్చాత్తాపాలకి నేను విలువ యివ్వను. దోషి నిజంగా పశ్చాత్తాపపడితే తన నేరాలకి శిక్ష కోరుకుంటాడు. లేకపోతే తన తప్పులు మాసిపోయే మార్గం లేదనుకుంటాడు. కానీ .." శంకరం ఒక్క క్షణం మౌనంగా నించున్నాడు. శేషయ్యవైపు నిర్మలంగా అర్ద్రతగా చూశాడు. కంఠస్వరం మెత్తగా, మృదువుగా మారింది - "నువ్వు అన్నార్తుడివై - అనాథుడివై - నాయింటి కొచ్చావు; నా గుమ్మం ఎక్కి 'దేహీ' అన్నవా శ్ళెవ్వరూ నిరాశతో వెళ్ళకూడదు. పిడికెడు బిచ్చం పెట్టటానికి వాడి గతచరిత్రేమిటో శోధించాల్సిన అవసరంలేదు. నిన్ను సాటి మానవుడిగా కనికరించే మానవత్వం నాకు వుంది. ఈ వృద్ధాప్యంలో నిన్ను ఆదరించేవా శ్ళెవరూ లేరని తెలుసు నాకు. నీపోషణకిమాత్రం నేను డబ్బు పంపిస్తూవుంటాను. ఇంతకుమించి నీకోసం కన్నబిడ్డగా నే నేమీ చెయ్యలేను. ఇదే నాకు న్యాయంగా తోస్తోంది. ఇకముందెప్పుడూ నాతండ్రి హోదాతోమాత్రం ఈ యింటికి రాకు" - చటుక్కున వెనక్కు తిరిగాడు శంకరం - "మాలా! ఆకలితో వున్నాడు; అన్నం పెట్టి - డబ్బుయిచ్చి పంపించు," అని చెప్పి నిర్వికారంగా లోపలికి వెళ్ళిపోయాడు - మానవుడు శంకరం.



ఈ రచనలో నేను కోరిన విషయసేకరణకు శ్రమతో సహకరించిన సోదరులు శ్రీ ఎమ్. రామకోటిగారికి మనస్ఫూర్తిగా నా కృతజ్ఞతను తెలుపుకుంటున్నాను.

రచయిత్రి




'అతను అందంగానే వుంటాడు.' -

అది మృణాలిని అభిప్రాయం. కానీ అతనితో పరిచయం ముఖపరిచయం మాత్రమే. చూపు కలిపి కనీసం ఓ గంటయినా కాలేదు. కారణం అదేరోజు వుదయాన ఆ యింటిలో దిగటమే

ఆ యింటిలో ప్రవేశించగానే మృణాలిని క్రొత్తదనం అనుభవించింది. అంతా క్రొత్త. ఏపని చేయబోయినా క్రొత్తగా కనిపించింది; తనవారే క్రొత్తగా కనిపించారు. పిచ్చెక్కినట్లు అనిపించింది. పాత యింటి జ్ఞాపకాలు వెంటాడసాగాయి.

ఆసాయంకాలం, ఏమీతోచక, తనకై కేటాయించుకున్న గది కిటికీలోంచి అలఓకగా అలా చూస్తూవుండగా, పాతిక గజాల దూరంలో వున్న బాల్కనీలోంచి ఓ జతకళ్ళు తనని పరిశీలించి చూచినట్లనిపించి, పరాయిమొగాడి చూపు లని తెలీటంతోటే చటుక్కున కిటికీ దాటి ఆవలకు వెళ్ళింది. ఐనా తన మనస్సులో అతని తాలూకు ప్రతిమ ఆవలికి వెళ్ళనంది.

మరికొంత సేపటికి మళ్ళీ కిటికీ దగ్గరగా నిలుచుని అతనికోసం ఓక్షణం అటు తిరిగింది. ఐతే అతను ఎటువైపో చూస్తున్నాడు. మృణాలిని కదలిపోలేదు. మరొక్క క్షణం వుండాలని అభిప్రాయపడింది. ఐతే వీలుకాలేదు; అమ్మ పిలుపుకు జవాబుగా కదిలిపోవలసి వచ్చింది.

మర్నాటి ఉదయంవరకు అతనిని మరచిపోయినట్లు భావించుకోటం మంచిదే. ఐనా మృణాలినికి మాత్రం ఆమరపు ఎంతోసేపు నిలువలేదు. కిటికీ బాల్కనీని గుర్తుతెచ్చింది. అదే క్షణాన తనకన్నులు అతనికోసమై పరికించ

సాగాయి. ఐతే 'మనిషి మనసు తరచూ–క్షణికమే' అని మృణాలిని ప్రవర్తన తెలియచేసింది. అలాంటి అభిప్రాయానికి రావటానికి కారణంగా, "తప్పు. పరాయి వాడికోసం అలా చూడకూడదు," అనుకుని, తను గదిలోంచి వెళ్ళిపోయింది. ఐనా అతను మనస్సులోంచి వెళ్ళలేదు. మరి కాసేపటికి అక్కడికే చేరింది. కుర్చీలో కూచుని చెల్లి కేకలు వింటోంది.

బాల్కనీలోంచి వినవచ్చిన మాటలు మృణాలిని చటుక్కున లేచి నిలుచునేట్టు చేశాయి. అటు యిటు చూసింది, చెల్లి గదిలోకి వచ్చిందేమో అని. రాలేదని నిశ్చయానికి రాగానే బాల్కనీవైపు చూసింది. అతని ప్రక్కన మరో అమ్మాయి కూచునివుంది. ఇద్దరూ కులాసాగా నవ్వుకోటం మృణాలినికి రుచించలేదు.

మరొక్కరోజు చూపులతోనే తృప్తి పడింది మృణాలిని. ఏం చేయటానికీ తనకు తోచటంలేదు. 'చెల్లే నయం. ఎంచక్కా వూరంతా ఏకం చేయగలదు,' అనుకుంది. కిటికీలోంచి అలా చూడటం, 'ప్చ్' అనుకోటం మామూలైంది. పరోక్షంగా అతని సాంగత్యం కోరుకుంది మృణాలిని. ఐనా అప్పుడప్పుడూ, మరో అమ్మాయి అతనితో నవ్వటమూ, కులాసాగా వుండటమూ మృణాలినిని కిటకీనుంచి దూరం చేసేవి. 'అతను...! ఏమో! ప్రేమిస్తున్నానేమో!' అనుకుంది. 'ప్రేమ' అనుకునేసరికి, 'కారు, హోండా, భర్త అందమూ–వూఁ! అందానికేం! అందంగానే వుంటాడు. లేకపోతే నామనసులోకి వచ్చేవాడా?'–అలా ఆలోచనలు వెన్నంటేవి.

ఐదోరోజు మృణాలిని మనసు మొండికేసింది. చెల్లిని పిలిచి ఎదురింటి బాల్కనీ గురించి భోగట్టా చేసేవరకు మారాము చేసింది. 'చెల్లి – సింసింద్రీ లాంటిది. ఐనా ఎంతో మంచిది,' అనుకుంది, తనకు కావలసిన వివరాలు వచ్చేసరికి. 'అమ్మో! అనవసరంగా భయపడ్డాను, ఆ అమ్మాయి అతని చెల్లెలే నన్నమాట!' – తేలికగా వూపిరి పీల్చింది.

బాల్కనీవైపు చూసింది. అతను అతనిప్రక్కన అతనిచెల్లెలు. ఒక్కమాటు వులిక్కిపడింది మృణాలిని. 'అదేఁవిటి? అతన్ని చేయిపట్టుకు నడిపిస్తోందేం?' వెంటనే కేకపెట్టింది. "జానకీ, జానకీ, ఒసేవ్! యిలారా! ఆ విషయం చెప్పనేలేదేం?" – ఇంకా చూపులు బాల్కనీవైపే వున్నాయి. వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఏఁవిటే ఆ గావుకేకలు. కొంప లంటుకున్నట్టు?" – అంటూ జానకి వచ్చింది.

"నిజంగా అంటుకునేవే! ఆయనగార్ని వాళ్ళచెల్లెలు చేయిపట్టుకు నడిపిస్తోందేవిటి? ఒంటో బావుండలేదా?"

"అదా! ... వూఁ. చూస్తూనేవున్నా: ఈమధ్య ఆయన్నిగురించి ఆరా తీస్తు

న్నావు. నీ కెందుకే?'' — నడ్డిమీద చేతు లుంచుకుని ఆరిందాలా ప్రశ్నించింది జానకి నవ్వుతూ.

''ఛస్! నోరుముయ్యవే! అడిగిం దానికి జవాబు చెప్పు.''

"ఓస్! ఎందు కింతకోపం? చెప్తా కానీ నా కేం ఇస్తావ్?''

''ముందు చెప్పవే మొద్దూ!" — అన్యా యము జరిగిపోయేదని కోపం ముంచుకు వస్తోంది మృణాళినికి.

జానకి నవ్వాపుకుంది రోజూ అతన్ని చూడటమూ, ఆయన చెల్లెల్ని ఆసరా చేసుకుని నడవటమూ, ఆఖరికి కుంటివా డన్న అభిప్రాయాన్ని జానకిలో తెచ్చాయి. ఆ సంగతే మృణాళినికి తెలియచేసి వెళ్ళిపోయింది. అంతకు మున్నే, 'ఏవిఁటీ?' అనుకుంది మృణా లిని. తేరుకుని చూసేసరికి క్రింద వీధిలో అన్నా చెల్లెళ్ళ వెళ్తూ కన్పించారు.

'ఐతే నిజఁవే నిన్నమాట' అను కుంది మృణాళిని. డబ్బు, పెట్రోలు, కారు, హోదా, భర్త అందముూ గుర్తుకు వచ్చాయి.

''హుఁ! ఇంకా నయ్యం. ఆయనతో స్నేహం చేద్దాఁ మనుకున్నాను. ముందే తెలిసింది. సరి! చూసిచూసీ కుంటివా డితో కాపురఁవా?'' అనుకుంది.

మరి కిటికీ ఆయన్ని గుర్తుచేసినా, మనసు మనిషిని మరోవైపు త్రిప్పేది. తర్వాత బాల్కనీ కన్పించటం మానే సింది తనకు. అథవా కన్పించినా 'ఎదు రింటివాళ్ళు బాల్కనీ యిటువైపు కట్టించా లేంవాతో? బుద్ధి లేపోతేసరి!' అను కునేది.

మరి నాల్రోజులు క్షణాల్లా గడిచాయి.

కాఫీ చప్పరిస్తూ, కిటికీ దగ్గరగా నిలుచున్న మృణాళిని అలా వీధివైపు చూసి ఆశ్చర్యపోయింది.

'అరే! అతనే! ఒంటరిగానే!' — నమ్మలేకపోయినా నిజం కనుక నమ్మే యాల్సి వచ్చింది. అవాక్కయి చూస్తోంది. అతను ఆగేడు. మరో పెద్ద మనిషి సమీపిస్తూ, "ఏఁవిటోయ్ కరుణా కరం! ఆమధ్య నీ కాలు బెణికిం దన్నారు. తగ్గిందా!" — గట్టిగానే పలుక రించాడు. అతను నవ్వేడు.

"ఆఁ ఆ! తగ్గిందండీ! ఓ వారం రోజులు బాలా బాధపెట్టింది, నడువనీ కుండా. ఇప్పుడు సమమైంది లెండి..."

మిగిలిన మాటలు మృణాళినికి విన్పించ లేదు.

''ఏవిఁటీ!" — అనుకుంది.




ఆ రోజు తన పుట్టిన రోజు. ఎంతో వుల్లాసంగా లేచి తలంటిసీళ్లు పోసుకుని కొత్తబట్ట లేసుకొన్నది శాంతి. భర్తతో కాసేపు సరదాగా వుండాలని తొందర తొందరగా తన రూముకేసి వెళ్ళింది. అప్పుడే అద్దంముందు నిలబడి తలదువ్వు కొంటూ ఎక్కడికో హడావిడిగా బయలు దేరుతున్నాడు శేఖర్.

శాంతిరాక గమనించి "నిన్నయిచ్చిన డబ్బుల్లో వేయిరూపాయలు ఇవ్వుశాంతీ!

లారీకి టైర్లు కొని వెయ్యాలి," అని అన్నాడు శేఖర్ !

ఆమెవైపు తిరిగేసరికి శేఖర్ కళ్ళు ఒక్కనిమిషం జిగేల్ మనిపించాయి. ఎఱ్ఱటి వెంకటగిరిచీర, దానిమీద తెల్లటి బ్లౌజు, చెవులకు రవ్వలదిద్దులు, మెడలో సన్నటి ముత్యాలవరుసల నక్లెసు, అప్పుడే తలంటిస్నానం చేయటంవలన జడ వదులు, వదులుగా అల్లుకొన్నది. ఈ ముస్తాబుతో ఆమె పచ్చటి శరీరచ్ఛాయ మెరిసిపోతున్నది. కంటికొసలలో తీర్చిన కాటుక రేఖలు ఆమె గుండ్రటి పెద్ద కళ్ళకు ఎంతో నిండుదనాన్నిస్తున్నది. ఒకంతసేపు చూపులు తిప్పుకోలేక పోయాడు శేఖర్.

"ఏమిటీరోజు దేవిగారి ముస్తాబులో క్రొత్తదనం కనిపిస్తున్నది." అన్నాడు చిలిపిగా. భర్త మాటలకు శాంతి ఒళ్ళు పులకించి ఆమె చెక్కిళ్ళు గులాబీలు పూసి ఎఱ్ఱటి ఆమె పెదవుల్లోని విరిసీ విరియని చిరునవ్వు ఒక్కసారి ముత్యాల పలు వరుసను తళుక్కు మనిపించింది.

"ఏమిటీరోజు రాణిగారు ఏవో క్రొత్త లోకాలలో వున్నట్లున్నది." అన్నాడు శేఖర్ దగ్గరకొచ్చి ఆమె గడ్డాన్ని పుణికి పైకెత్తి కళ్ళలోకి చూస్తూ. ఆ స్పర్శతో ఆమె మరింత సిగ్గుతో ముడుచుకపోయి అతని ఎదమీద తలవాల్చి "ఈరోజు నా పుట్టినరోజు'' అన్నది.

"ఓహ్ అదా సంగతి. నాకు తెలియనే తెలియదే" అని ఆమెను పొదవిపట్టుకొని బుగ్గమీద గట్టిగా ఒక ముద్దుపెట్టుకొని "అయితే నీకు ఏమి బహుమతి కావాలో అడుగు శాంతీ'' అన్నాడు ఎంతో లాలనగా.

"అడిగింది తప్పక యిస్తారా ?" అన్నది అతని కళ్ళలోకి గుచ్చిచూస్తూ.

"రాణీగారు అడగడము, యీ సేవకుడు ఇవ్వక పోవడమూనా ! అడుగు శాంతీ నీ కేంకావాలో'' అన్నాడు శేఖర్.

"దేవుని దయవలన నాకు అన్నీ వున్నాయి. ఏకొరతా లేదు. నాకు కావలసింది యీ ఒక్కరోజు మీరు నాతో ఆనందంగా గడపాలని, ఏవయినా పనులుంటే యీరోజు నాకోసం మానుకోమని చెబుతున్నాను." అన్నది ఎంతో ఆశగా.

"సారీ ! శాంతీ ! ఈరోజు సోమవారం. లారీలను లోడ్లకు పంపించాలి. రిపేర్లకు పోయే లారీకి టైర్లు పోయినవి. టైర్లువేసి మధ్యాహ్నానికయినా దాన్ని లోడ్ కు పంపించాలి. ఈరోజు పూర్తిగా నీతో వుంటే ఎంతడబ్బు నష్టమవుతుందో ఆలోచించావా ?"

శేఖర్ మాటలకు శాంతి హృదయం బాధగా మూలిగింది. దెబ్బతిన్న లేడిలాగ ఆమెమొహం పాలిపోయింది. పేలవంగా నవ్వి "డబ్బు ! డబ్బు ! మనిషికి సుఖంలేని డబ్బు ఎందుకండీ ! ఇప్పుడు వున్నదంతా కూర్చొని తిన్నా పది తరాల

కయినా మిగుల్తుంది. అలాగని మిమ్మల్ని ఎప్పుడూ నాదగ్గరే చేతులు ముడుచుకొని కూర్చోమనలేదు. ఏమయినా సరదాలు మనము అనుకొన్నపుడు రావు. ప్లీజ్! నాకోసం యీ ఒక్కరోజు వుండిపోండి!" అన్నది శాంతి.

శాంతి మాటలకు ఆమెతల నిమురుతూ "పిచ్చిశాంతీ! నీకింకా లోకానుభవం తెలియదు. - డబ్బువిలువ అంతకన్నా తెలియదు." అని శేఖర్ యింకా ఏమో చెప్పబోయేంతలో "శేఖరా! ఏం చేస్తున్నావురా యింకా? ఈ యింటిలో ఒక్కరూ నేను చెప్పినమాట వినరు. గూటి పందులులాగ ఎంతసేపు ఇళ్ళల్లో దూరుకుంటే బయటే రారుకదరా. ఎలా మీరు బతుకుతారో! ఏమో! ఒక్కడికీ బాధ్యతే తెలియదు. అరచి అరచి నానోరు పడిపోవలసిందే. ఇంకయినా తెమిలి రండిరా." అన్న రాధాబాయమ్మ కేకలు ఆబిల్డింగు ప్రతిధ్వనించి ఇద్దరి చెవుల్లోనూ పడ్డాయి

శేఖర్ "వస్తున్నానమ్మా!" అని చెప్పి "శాంతీ! చూశావా అమ్మ కోప్పడుతున్నది. ఈరోజు తొందరగా వచ్చేస్తాను. ఏ మనుకోకు." అని షర్టు గుండీలు సరిచేసుకొంటూ తొందర తొందరగా వెళ్ళిపోయాడు.

భర్తతో సరదాగా కాలక్షేపం చేయాలనుకొన్న శాంతికి ఎంతో ఆశాభంగమయి బాధపడిపోయింది ఏమీ తోచక అచేతనంగా కొంతసేపు నిలబడిపోయిన శాంతికి దుఃఖము ముంచుకురాగా అక్కడే వున్న కుషన్ మంచముమీద కప్పగాపడి దిండులో తలదాచుకుంది. పదినెలల పాప ప్రాకుతూవచ్చి కొంగుపట్టి లాగింది 'అమ్మా' అంటూ. శాంతి తొందరగాలేచి కళ్ళుతుడుచుకొని పాపను ఎత్తుకొని హృదయానికి హత్తుకొన్నది.

ఇంతలో తోడికోడలు సుశీలవచ్చి "శాంతీ పెన్నువుంటే యిస్తావూ వుత్తరం వ్రాయాలి." అన్నమాటలకు యీలోకం లోకొచ్చి గబగబ లేచి మొహంలో లేని చిరునవ్వు తెచ్చుకొని పెన్నుతెచ్చి సుశీలకు యిచ్చింది. ఇంతలో రాధాబాయమ్మ "పాపా! యిలా రండి ఈ అనపకాయలు వలవాలి. ఇంతమంది ఆడవాళ్ళు వున్నారుగానీ ఒక్కరూ వంటింటి గడపకేరారు. ఎన్నిరోజులు జరగాలమ్మా యీ భోగాలూ!" అన్న అత్తగారి కేకలకు శాంతి వస్తున్నానత్తయ్యా! అంటూ గదితలుపులు దగ్గరగా చేరవేసి వంటింటివైపు నడిచింది సుశీలమాత్రం పెన్ను తీసుకొని ఏమీ పట్టనట్టు తన గదికేసి వెళ్ళిపోయింది.

పాపను అత్తదగ్గర కూర్చోబెట్టి అనపకాయ వలవడాని కుపక్రమించింది శాంతి. పాప అటూయిటూ ప్రాకుతూ చెంబులు, గిన్నెలు సర్దడం ప్రారంభించింది. రాధాబాయమ్మ స్థూలకాయురాలు! ఆమె కూర్చొంటే మళ్ళీ లేవలేదు. ఆ



పాపను పట్టలేక "లెయ్యమ్మా! లేచి కూతుర్ని ఎత్తుకో. మీరు పనులుచేసి సంసారాలు నిలబెట్టింది చాలు. నీ కూతుర్ని తీసుకపోయి కూర్చోతల్లీ." అని సణగటం ప్రారంభించేసరికి శాంతి కిక్కురు మనకుండా కూతుర్ని తీసుకొని యీవలకొచ్చేసింది. ఇంతలో సుశీల వచ్చి "శాంతీ ఈ పెన్ను తీసుకో. అయిపోయిందా పని? ఇంతమంది పనివాళ్ల వుండగా ఈమె కెందుకింత రంధి?" అనేసి వెళ్ళిపోయింది.

శాంతి పాపను నిద్ర పుచ్చి పాప ప్రక్కనే పడుకొన్నది. ఆమె మనసు యివ్వాళ చాలా చికాకుగా వున్నది. ఏమి టేమిటో ఆలోచనలు. మరెంతో విచారము. ఒక్కక్షణం ఎందు కీజీవితం అనిపించింది ఆమెకు. తను పుట్టిం దగ్గరనుండి ఏ సుఖానికీ నోచుకోలేదు. తిండికి బట్టకు ఏ లోటూ వుండేదికాదు. మానసికంగా పసివయస్సునుండి ఒక్క రోజు ఆనందంగా వుండలేదు.

అత్త రాధాబాయమ్మ కాస్తగయ్యాళి.

పెళ్ళయాక మదరాసు వచ్చిన వారం పదిరోజులకి అత్తింటి పరిస్థితులు పూర్తిగా అవగాహన మయిపోయినయ్."

అత్తగారింటిలో తనకు, తనభర్తకు ప్రత్యేకించి ఒకగది యిచ్చారు. తన వస్తువులన్నీ అందులోనే వుంచుకొన్నది.

అత్తగారి ఆజ్ఞలేనిదే ఎవరూ ఏపని చేయడానికి వీలులేదు. తనకు ఇద్దరు తోడికోడళ్ళు. ఆ యింటిలో నౌకర్లకుండే విలువగూడ ఆ యింటిలో కోడళ్ళకులేదు. పనివాళ్ళు పెట్టిన అన్నం తినాలి. ఎవరి గదుల్లోకి వాళ్ళు వచ్చెయాలి. భర్తలకుగూడ పనివారే వడ్డిస్తారు. భార్యలు వడ్డించడానికి వీలులేదు. ఆడవారు ఎవరికంటా పడకూడదు. ఎవరయినా కొత్తవారొస్తే వెంటనే లోపలి కెళ్ళిపోవాలి. తనతలిదండ్రులొచ్చినాసరే తను స్వంతంగా ఏమిచేయడానికి వీలులేదు...

... ఇక భర్తగారు సరేసరి. ఒక క్షణం యింటిపట్టున వుండడానికి వీలులేదు. ఎప్పుడూ వ్యాపారాలు, లారీలు, లోడ్‌లు బుక్ చెయ్యడం, డబ్బులు వసూలు చేసుకోవడం సరిపోతుంది. ఒక పదినిమషాలు ఇంటిదగ్గరవున్నా అత్తగారు గట్టిగా కేకలుపెట్టి పంపేస్తారు.

తన ఆశలన్నీ కూలిపోగా ఒకవిధమయిన నిర్లిప్తత ఆవహించి శూన్యంగా జీవించసాగింది. "పాపకు జ్వరం డాక్టరుకు చూపించాలండీ!" అంటే "ఈరోజే ఎక్కువలోడ్లు వస్తున్నాయి శాంతీ! రేపు తీసుకెళతా!" అని సమాధానం వచ్చేది.

"ఈరోజు చికాగ్గా వున్నదండీ ఏదయినా సినిమాకు తీసుకెళ్ళరూ?" అంటే లారీలు పదిగంటలకుగానీరావు శాంతీ ఈరోజు. రేపువెళ్ళదాం." ఇలాంటి సమాధానాలు రావడంతో భర్తను యింకేమీ అడగటానికి ఆమె ఎప్పుడూ సాహసించలేదు.

ఇంతలో పాపలేచి ఏడ్వటం మొదలుపెట్టేసరికి వుల్కిపడి ఈ లోకంలో కొచ్చిపాపకు పాలుపట్టి ఆడుకోనిచ్చింది.

కనీసం రాత్రి ఏడుగంటలకయినా యింటికివస్తారని ఎంతో ఆశగా ఎదురు చూచింది. ఏడయింది. ఎనిమిదయింది. పది, పదకొండుగూడ చూపింది ముల్లు. ఎంతో దుఃఖంవచ్చింది. వెంకటేశ్వర పటంముందువెళ్ళి తనివిదీర ఏడ్చి ఇకనా జీవితమింతే భగవాన్ నాకెందుకు యీ బంగారుపంజరం? ఎందుకు అన్యాయం చేశావని ఏడ్చి మనసును తేలికపరచుకొని నాగతి యింతే. నీవుమాత్రం ఏంచేయగలవు? అని మనసు దిటవుపరచుకొని వెళ్ళి పడుకుంది.

గట్టి మనసు చేసుకొని నిదురబోయింది. భర్తవచ్చాడు. ప్రక్కనపడుకున్నాడు. లేపాడు. తనకుమెలకువవచ్చింది.

"కోపమొచ్చిందా?" అడిగాడు.

ఆమె ఆనందానికి మేరలేకపోయింది. సాయంత్రంనుంచి ఆమె మనస్సులో మెదిలిన ఆలోచనలన్నీ ఒక్కసారిగా అదృశ్యమైపోయ్యాయి.

ఆరోజు ఆమె పుట్టినరోజు అందుకని అన్నీ మరచిపోయి ఒక్కసారిగా అతన్ని కౌగలించుకుంది.

——

# వ్యక్తిత్వం లేని మనిషి

జరిగిన కథ

[మాలతి మృత్యుంజయరావుల మధ్య సాన్నిహిత్యం ఎక్కువవుతోంది. ఆ కారణంగా ఆఫీసులో అందరూ, ముఖ్యంగా శేఖరం తురంగరావూ, సోమయాజులూ. చివరకు ఆఫీసరుకూడా మృత్యుంజయరావుయెడల ఈర్ష్యాసూయలతో ప్రవర్తిస్తున్నారు. మృత్యుంజయరావు ఒకవిధంగా ఆనందంతో ఉప్పొంగిపోయాడు - తను ఇంతమందిని ఇలా కదిల్చివేసినందుకు.

మళ్ళీ జగతి డైరీ చూచాడు - ''స్వామివారియందు నాకు భక్తితాత్పర్యాలు అధికమవుతున్నయి - స్వామివారిలో ఏదో మార్పు. ఎందుకో అలజడీ ప్రవేశించినయి. స్వామివారి సన్నిధి కిక వెళ్ళకూడదనే మనోనిబ్బరాన్ని సాయంత్రం కాగానే కోల్పోయి, కాళ్ళు అక్కడికే దారి తీస్తున్నయి;'' మృత్యుంజయరావుకు జగతి ప్రవర్తన ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఆ డైరీలోని తదుపరి విషయాలు చదువసాగాడు.]

— ఇక ముందుకు సాగండి.

"ఆ రోజు రాత్రి అంతా వెళ్ళిపోయాక నేను స్వామిని సమీపించాను. శిష్యులు లోపల వున్నారు. బహుశా పొంచి చూస్తున్నారేమో! ఆశ్చర్యంలేదు.

స్వామి తమ ఆకర్ణాంత నేత్రాలతో నావంక చూస్తున్నారు. ఏముంది ఆ చూపుల్లో? జాలా? ప్రేమా? కరుణా? కాల్పనికమా?

ఏ మడగాలని ఆయన్ని సమీపించానో తెలీదు. ఎదురుగా బొమ్మలా నిలబడ్డాను.

'జగతీ!' స్వామిపెదవులు ఉచ్చరించాయి. ఎప్పుడూ అట్లా సంబోధించి ఎరుగడు. నివ్వెరపోయాను.

'జగతీ! నిన్ను మనసారా వేడుకుంటున్నాను. నువ్వు యిహమీదట యిక్కడికి రాకు. నాకు కనిపించకు.'

నాకు దుఃఖం పొంగిపొర్లింది. నా పాపాన్ని ఎవరో ఎత్తిచూపినట్లయింది. 'స్వామీ; నే నేమి అపరాధం చేశాను? ఎందుకు నన్ను వెళ్ళిపొమ్మంటున్నారు?' అని ప్రశ్నించాను రుద్ధకంఠంతో.

ఆయన నా వంక జాలిగా చూశారు. 'నీ వేమీ చెయ్యలేదు. అపరాధం నేనే చేశాను.' అన్నారు ఆర్ద్రస్వరంతో.

కొమ్మూరి వేణుగోపాలరావు

'ఏమిటి స్వామీ మీ రంటున్నది?'

'అవును జగతీ: శృంగేరి పీఠాధిపతులవద్ద ఉపదేశం పొంది, సన్యాసాశ్రమం స్వీకరించిన పిదప అనేక ప్రదేశాలు సంచరించాను. అనేకమంది వ్యక్తులతో మెలిగాను. ఎంతోమంది స్త్రీలు, నీ కంటేకూడా యౌవ్వనవతులు నాతో ఎంతో సన్నిహితంగా మెలిగారు. అయినా నా మనస్సు ఎన్నడూ చలించలేదు. అసలు బాల్యంనుంచీకూడా నేను అతి కఠినమైన నియమాలతో పెరిగి, శిలలాంటి మనస్సునూ, ఎవరూ ఛేదించలేని నిగ్రహశక్తినీ అలవర్చుకున్నాను. నా నిగ్రహశక్తి అవధులులేనిది. దాన్ని చూసి నేను గర్వపడేవాణ్ని. ఇంద్రియాలనూ, ఐహికవాంఛలనూ అవలీలగా జయించిన తపస్వి నని తృప్తిపడేది.

'నా మనస్సుని ఎలా అభ్యాసం చేశానంటే స్వప్నంలోకూడా నేనెవర్నీ కాంక్షించి ఎరుగను. అసలు పరాన్నిగురించి తప్ప యిహాన్ని గురించి నాకు స్వప్నాలే వచ్చి ఎరుగవు.

'అప్పటివరకూ అస్ఖలిత బ్రహ్మచారిని.

'కాని నీవు ప్రవేశించావు. నేను క్రిందకి జారిపోవటం మొదలుపెట్టాను. నాలో మునుపెన్నడూ లేని మనోవికారం ప్రారంభ మయింది. ప్రకృతిశక్తులు నన్ను లోబర్చుకో సాగాయి.

'ఎన్నోసార్లు! ఎన్నిసార్లు నువ్వు స్వప్నంలో సాక్షాత్కరించావో. నిద్రలో "జగతీ! జగతీ!" అని కేకలుపెట్టానట, శిష్యులు చెప్పారు. స్వప్నావస్థలో ఎన్ని రంగులలో, ఎన్ని ఆకృతులతో, ఎన్ని రూపవిశేషాలతో గోచరించావు? నగ్నమూర్తివై నర్తించావుకూడా! జగతీ! ఆఖరికి స్వప్నంలో నిన్ను రమించాను. నేనిహ అస్ఖలిత బ్రహ్మచారిని కాను.'

'స్వామీ!' నా కాళ్ళక్రింద భూమి కంపించింది. రెండుచేతులతో చెవులు మూసుకున్నాను?

'అవును; అందుకే చెబుతున్నాను ఇన్నాళ్ళూ అభేద్యమనుకున్న నా యింద్రియ నిగ్రహశక్తి పటాపంచలయింది. నేను ఉన్మత్తుణ్ని అవుతున్నాను. ప్రకృతిశక్తి కాలిక్రింద నిర్దాక్షిణ్యంగా నలిగిపోతున్నాను. నాకు మనశ్శాంతి లేదు. నా కఠోరవ్రతం భంగపడుతున్నది. నలుగురిముందు లోపవంచకుడిగా నిలబడేరోజు రాబోతున్నది. అందుకే జగతీ! అందుకే నిన్ను వేడుకుంటున్నాను. నన్ను కరుణించి, నా దృష్టికి అందని దూరతీరాలకు వెళ్ళిపో. తిరిగి ఎప్పుడూ కనిపించకు. వెళ్ళిపో




జగతి: వెళ్ళిపో' ఆయన కంఠంలో గాద్గదికత. నేత్రాలలోంచి అశ్రువులు స్రవిస్తున్నాయి. అంత దీనమూర్తిని ఎప్పుడూ చూడలేదు.

నేను చలించిపోయాను. కళ్ళు తిరుగుతున్నాయి. గొంతు తడారిపోయింది. ఎక్కడికో గాలిలో తేలిపోతున్నట్లు అనిపించింది. 'మిమ్మల్ని యింత దుర్భరవేదనకు గురిచేసిన యీ పాపిని క్షమించండి స్వామీ!' అని గొణిగాను. వొంగి ఆయన పాదాలను కళ్ళకద్దుకుని తడబడుతూన్న అడుగులతో బయటకు నడిచాను.

భగవాన్ : నేనిప్పుడేం చెయ్యాను? అసలీ ఊరు రాకపోయినా బాగుండేది. ఎక్కడనో దెయ్యంలా తిరుగాడుతూ, మామూలుజీవితం జీవిస్తూ వుండేదాన్ని. ఇప్పుడు నా భవిష్యత్తు ఏమిటి? నాకు తోడు ఎవరు? ఈ కొత్త జీవితానికి అలవాటుపడి, మిగతా రోజులన్నీ ఎలా గడుపను? నాకు దారి ఎవరు చూపిస్తారు?

ఆలోచనలతో అలసిపోతున్నాను. నాకు పిచ్చెక్కుతుందేమోనని భయంగా వుంది.

*    *    *    *

మరునాడు ఆమె స్నానానికి వెళ్ళినపుడు మృత్యుంజయరావు యిది చదివాడు. ఆ సాయంత్రం ఆఫీసునుండి పెందళకడనే గదికి వచ్చాడు.

జగతి కాలుగాలిన పిల్లిలా అటూ యిటూ తిరుగుతోంది. ఏడ్చి ఏడ్చి వున్నట్లు చెంపలనిండా కన్నీటిచారికలు, కళ్ళు ఎర్రబడి, ముఖం వాడిపోయివుంది. తనలో తను ఏదో గొణుక్కుంటోంది.

అతను మంచంమీద కూర్చుని ఆమె వంక జాలిగా చూస్తున్నాడు. ఆమె యీ వూరికి వచ్చిన యీ రెండుమూడు నెలలలోనూ ఎన్ని మార్పులు సంభవించాయి!! ఆమె అంటే అతనికి అవ్యాజానురాగం వుంది. ప్రగాఢమైన భక్తి వుంది. ఆమెను పలకరించా లనుకున్నాడు. ఓదార్చా లనుకున్నాడు. 'అక్కా! ఎందుకే అలా దుఃఖపడతావు? నీ కన్నీరు నన్ను తుడవనీ! నా వొడిలో సేదతేరి విశ్రాంతి తీసుకో. నీ తల నన్ను నిమరనీ. అక్కా! ఏడవకు, ఇక్కడినుంచి ఎక్కడికీ పోకు. నన్ను నీకు రక్షణ యివ్వనీ,' అని ఎన్నెన్నో చెప్పి ఊరడించా లనుకున్నాడు. చేతకాలేదు. చూస్తూ, బాధపడుతూ ఊరుకున్నాడు.

క్రమంగా చీకటిపడింది. నక్షత్రాలు ఆకాశంలో మినుకుమన్నాయి. అయినా జగతి వెర్రిదానిలా తిరగటం మానలేదు. బయటకు వెళ్ళే ప్రయత్నమే చెయ్యలేదు.

ఉన్నట్లుండి మృత్యుంజయరావుకు ఆ స్వామివార్ని చూద్దామని బుద్ధిపుట్టింది. ఇన్నాళ్ళూ అత నెప్పుడూ మఠంలో ప్రవేశించలేదు. స్వామిని సందర్శించలేదు. ఆయన ఎలావున్నాడో, ఏం చేస్తున్నాడో చూద్దా మనిపించింది.

లేచి "అలా బయటకు వెళ్ళివస్తా నక్కా!" అన్నాడు.

ఆమెకు వినబడినట్టులేదు.

నెమ్మదిగా బయటకు వచ్చి, తలుపులు దగ్గరగా మూసి, గేటు దాటి మఠంవైపు నడవసాగాడు.

అత నక్కడకు చేరుకునేసరికి, జనం ఎవరూ కనిపించకపోవటం చూసి విస్మయం చెందాడు. చెప్పులు బయట విడిచి లోపలకు వెళ్ళాడు. మందిరమంతా కళావిహీనంగా వుంది. ఒకటో రెండో దీపాలు తప్ప మిగతావన్నీ ఆర్పివేసి వున్నాయి. స్వామి ప్రతిష్ఠించిన విగ్రహాలదగ్గర అర్చకుడు లేడు. మఠ నిర్వహణకు సంబంధించిన ఒక వృద్ధాంగన, మూలెక్కడో చాపమీద కూర్చుని తాళం తిప్పుతోంది.

మృత్యుంజయరావు ఆమెదగ్గరకు వెళ్ళాడు. "స్వామివారు ఏమయినారో చెప్ప గలరా?" అనడిగాడు బిగ్గరగా.

వృద్ధాంగన కళ్ళు తెరిచింది. "స్వామివారు మాధవీపురంలోని వారి ఆశ్రమానికి యీ ఉదయం వెళ్ళిపోయారుగా!" అంది వొణికే కంఠంతో.

అతను చకితుడై ''అంత హఠాత్తుగా వెళ్ళిపోవటానికి కారణం తెలుసా?'' అని ప్రశ్నించాడు.

వృద్ధాంగన అతనివైపు నిదానించి చూసి, "రాత్రినుండి వారి ఆరోగ్యం సరిగ్గా లేదు. అర్ధరాత్రి నిద్రలో చాలాసార్లు కేకలు పెట్టారు. తెల్లవార్లూ కలవరిస్తూనే వున్నారు. ఉదయం లేచేసరికి చాలా బడలికగా, వడిలిపోయివున్నారు. 'నా కేం స్వస్థతగాలేదు. ఇక్కడ్నుంచి తక్షణం వెళ్ళిపోవాలి,' అన్నారు. భక్తులంతా కంగారుపడి అప్పుడే వెళ్ళిపోవద్దని ఎంతో ప్రార్థించారు. వారు వినలేదు. 'ఆశ్రమం నుండి నాకు పిలుపు వచ్చింది; వెళ్ళాలి,' అని పట్టుబట్టారు. వారి నాపటం ఎవరి తరమూ కాకపోయింది. అంతే – అప్పటికప్పుడు అన్నీ సర్దుకుని శిష్యులతో వెళ్ళిపోయారు. ఆయన కేం కష్టం వచ్చిందో! మహానుభావుడు,'' అని కళ్ళుతుడుచుకుంది.

మృత్యుంజయరావుకు అర్ధమైంది. ఆవిడకి నమస్కారం చేసి బయటకు వచ్చి గబగబ యింటిదారి పట్టాడు.

అతను గదికి వచ్చేసరికి జగతి కుర్చీలో కూర్చుని రెండు చేతుల్లో తల పెట్టుకుని దీర్ఘంగా ఆలోచిస్తోంది. అడుగులచప్పుడు విని ముఖం త్రిప్పి చూసింది.

చెప్పనా వద్దా అని తటపటాయిస్తున్నాడు అతను. రెండు నిముషాలు మధన పడ్డాడు. చివరికి చెప్పటానికే నిశ్చయించుకుని దగ్గర చేరాడు.

గొంతు సవరించుకుని ''అలా పనిమీద మఠందాకా వెళ్ళివచ్చానక్కా! స్వాములాడు యీ ఉదయం హఠాత్తుగా మఠం ఖాళీచేసి వెళ్ళిపోయారుట. అక్కడ జనం చెప్పుకుంటున్నారు," అన్నాడు భయపడుతూ.

ఆమె దెబ్బతిన్నట్లు బెదిరి అతనికేసి విహ్వలదృషితో చూస్తోంది. ఆమె ముఖం తైలం లేని దీపంలా వెలాతెలాపోతోంది. హేమంతకాలంలో కలువలు లేని కాసారంలా నివ్వెరపోతోంది.

* * * *

అప్పట్నుంచీ జగతి యోగినిలా అయిపోయింది. ఏమీ మాట్లాడదు. సరిగ్గా తినదు మృత్యుంజయరావు దగ్గర చేరి బ్రతిమాలగా నాలుగు మెతుకులు తింటుంది. వెళ్ళి పడుకుంటుంది. అర్ధరాత్రిపూట తలుపులు తీసుకుని వసారాలోకి వెళ్ళి అరుగుమీద నిలబడి పిచ్చిదానిలా శూన్యంలోకి తిలకిస్తూవుంటుంది.

మృత్యుంజయరావు మాలతిని తీసుకువద్దా మనుకున్నాడు. కాని యింకేం కొత్త ఉపద్రవం ముంచుకొస్తుందో! భయపడి వూరుకున్నాడు.

చిలకమ్మగారు తన ఉల్లాసకరమైన ధోరణితో ఆమె మనసును రంజింపచేయటానికి ప్రయత్నించి విఫలురాలై మిన్నకుంది.

ఒకరోజు మృత్యుంజయరావు ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి జగతి లేదు. బల్లమీద కాగితం పెట్టివుంది.

"ఎలా వచ్చానో, అలా వెళ్ళిపోతున్నాను. నన్నుగురించి వెతక్కు— జగతి"

అతని కాళ్ళక్రింద భూమి కదిలింది. తల పట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు.

# 12

తర్వాత చాలా రోజులు మృత్యుంజయరావు జీవితం ఒడుదుడుకులు లేకుండా గడిచిపోయింది. ఒడుదుడుకులు లేకుండా అంటే ప్రశాంతంగా గడిచిందని కాదు; సాదాగా గడిచింది; మందకోడిగా గడిచింది; నిస్సారంగా గడిచింది. అసలతని జీవితం సారవంతంగా ఎప్పుడూ లేదు. కాని జగతి రాకతో ఓ ఒరవడి ఏర్పడినట్లయింది. సార్థకత లభించినట్లయింది. ఓ వెల్తి తీరినట్లు అనిపించింది. ఇప్పుడా నూతన అనుభూతులు అన్నీ అంతరించి ఎప్పటి జడపదార్థంగా మిగిలాడు. అయితే ఈ జడపదార్థానికి గుండె వుంది. కాని అక్కరకురాని గుండె. ఎన్నో రాత్రులు అతను దుప్పటి కప్పుకు పడుకుని 'భగవంతుడా! నన్నెందుకు పుట్టించావు?' అని ప్రశ్న వేసేవాడు తనలో తను కుమిలి, కుళ్ళి క్షీణించేవాడు. అతనికి ఒక్కొక్కసారి చచ్చిపోవా లనిపించేది. కాని చావంటే భయం. తనంటే తనకు భయం. వల్లమాలిన అసహ్యం. తనని తాను భరించలేకపోయేవాడు. జగతిని వెతికే ప్రయత్న మేమీ చెయ్యలేదు. మాలతి అడిగింది ఒక రోజు ఆమెని గురించి. వెళ్ళిపోయిందని చెప్పాడు. ఎక్కడికని ఆమె అడుగుతుందేమో నని హడలిపోయాడు. కాని ఆమె అడగలేదు. నిట్టూర్పు విడిచి, నిష్ఠుర స్వరంతో, "మీరు చెడ్డవారు. ఆమెను మళ్ళీ కలుసుకుందామని ఎంతో ఉబలాట పడ్డాను; పడనిచ్చారు కాదు," అంది.

ఈమధ్య మాలతినికూడా ఎక్కువ కలుసుకోవటం లేదు. ఎప్పుడు వెళ్ళినా పశుపతిగారు యింట్లో వుంటున్నారు. తనని గురించి ఆయన ఏమని తలచినా, తను చీటికీ మాటికీ వస్తున్నందుకు ఆయన విసుక్కుంటున్నా డేమోనని అతని భయం. అదీగాక మాలతి తల్లి సత్యవతమ్మగారు హై బ్లడ్ ప్రెషర్‌తో బాధ

పడుతోంది. దానికితోడు కూతురి వివాహం గురించి ఆమె బెంగ పెట్టుకుంది. పోయినప్పుడల్లా అదో పెద్ద ప్రసక్తి అయిపోయింది.

ఒకరోజు అర్ధరాత్రి అతను కలతనిద్రలో పీడకలలు కంటుండగా యింటి వారి భాగంనుండి పెద్దపెట్టున కేకలు వినిపించాయి. "కొంప మునిగిపోయింది నాయనోయ్!" చిలకమ్మగారి కంఠం అది. అతను తృళ్ళిపడి లేచి అదరాబాదరాగా తలుపులు తెరుచుకుని పరిగెత్తాడు. హాల్లో మంచంమీద శ్రీకంఠంగారు కళ్ళు తెరుచుకుని చలనం లేకుండా పడుకునివున్నాడు. చిలకమ్మగారు గట్టిగా ఏడుస్తూ "డాక్టర్ని పిల్చుకురండి బాబూ!" అని అరుస్తోంది. అతను కంగారు పడుతూ డాక్టర్ని పిల్చుకురావాలని పరిగెత్తటానికి సిద్ధపడుతున్నాడు. కాని ఇంతలోనే ఆవిడ కేకలు విని లోపలకు పరిగెత్తుకువచ్చినవారిలో ఒకాయన శ్రీకంఠంగారి చెయ్యి చూసి, "ప్రాణం లేదండీ," అని పెదవి విరిచాడు. నలుగురూ కలసి మృత కళేబరాన్ని క్రిందకి దింపారు.

ఇహ చిలకమ్మగారు ఏడ్చింది. ఎంత అందంగా ఏడ్చిందని. ఆవిడ జుట్టు ముడి ఊడిపోయి దీర్ఘమైన శిరోజాలు ముఖంమీద విచ్చుకున్నాయి. భర్త వక్షస్థలంమీద తల ఆన్చి ఏవేవో మాటలు అంటూ దుఃఖిస్తోంది. "నాన్నా! ఎన్ని

ఆశలు కల్పించావురా ? ఒక్కటీ తీర్చకుండా అప్పుడే నూరేళ్ళూ నిండినట్లు వెళ్ళి పోయావురా. శ్రీ! నువ్వు లేకుండా యీ భూమ్మీద ఎలా మసలుకోను! బాబూ! ఒక్కసారి కళ్ళు తెరిచి నా వంక చూడవూ! నేనూ! నీ ప్రియతమని."

నడివయసులో వున్న స్త్రీ అలా అంటూ, ఏడుస్తూంటే అతనికి ఏవగింపు కలగకపోగా ముగ్ధుడయి చూస్తున్నాడు. పడకటింట్లోని సంబోధనలన్నీ ఆమె చేస్తోంది వాళ్ళు ఎంత శృంగారజీవులో అనుకుని చలించాడు. అతనికి వారిపట్ల భక్తిభావం జనించింది.

భుజంమీద చెయ్యి పడితే తలత్రిప్పి చూశాడు. పిచ్చివాడు "ఈ యింట్లోకి కొత్తగా వచ్చిన మేస్టారు కదూ," అని అడిగాడు.

మృత్యుంజయరావు అవునన్నట్లు తల ఊపాడు.

"ఎందుకంతా ఏడుస్తున్నారూ ? ఎవరయినా చచ్చారేమిటి ?''

"మీ బావగారు పోయారు ?''

"పాపం! న న్నెప్పుడూ వెక్కిరిస్తూ ఉండేవాడు," అని అతను అరుగు మీద మూల చేరి బీడీ అంటించాడు.

ఊళ్ళోని బంధువులంతా వచ్చి ఎవరు చేయవలసిన సాయం వాళ్లు చేస్తున్నారు. హఠాత్తుగా తనుకూడా ఏదయినా సాయపడి తన ఉనికిని స్మరణీయం చేయాలని మృత్యుంజయరావుకు స్ఫురించింది. కాలుగాలిన పిల్లిలా వాళ్ళందరి మధ్యనుంచీ అటూయిటూ తిరిగాడు. ఎవరన్నా ఏ పని అయినా చెబుతారేమో నని చూశాడు. ఎవరూ పిలవడంల్లేదు ఆఖరికి ఒక ముసలాయన దగ్గరకు వెళ్ళి, "ఏమండీ, నేను యీ యింట్లో అద్దెకుంటున్నాను. ఏమయినా సాయం కావలసివస్తే అడగండి. మొహమాట పడకండి," అన్నాడు. ఆ ముసలాయన ఒక నిముషం అతనిసంత ఎగాదిగా చూసి, "ఏమీలేదు. రేపట్నుంచీ కర్మకాండ అంతా జరగవల్సివుంటుంది. ఇల్లంతా బంధువులుంటారు. సరిపోదు. మీరు ఏమీ అనుకోక ఖాళీ చేస్తే ..'' అన్నాడు. మృత్యుంజయరావు గతుక్కుమన్నాడు. ''సరే సరే'' అని యివతలకు వచ్చాడు. అప్పట్నుంచీ అతని మనసు మనసులో లేదు.

తెల్లవారి, శవానికి స్నానం వగైరాలు, అంత్యక్రియ లన్నీ యధావిధిగా నిర్వర్తించబడుతున్నాయి. చిలకమ్మగారి మేనల్లుడు — పిచ్చివాడి కొడుకు గబగబ తల్లిదగ్గర కొచ్చి "అమ్మా! నాకు స్కూల్ టైమయింది. అన్నం పెట్టు," అని గోల చేస్తున్నాడు. ఆవిడ ఎవరూ వినలేదుకదా నని అటూయిటూ చూసి, వాడి నోరు మూసి, బరబర అవతలకు లాక్కువెళ్ళి, "తప్పు నాన్నా! మామయ్యగారు

**సన్‌లైట్** వల్ల ప్రతిమాటూ

**మీ బట్టలు**

**అతికాంతిగా ఉతుకబడును**




లింటాస్-ఏ. 62-77 TL (R)

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

పోయారు. మనమంతా కష్టంలో వున్నాం. కొన్నాళ్ళదాకా బడికి పోకూడదు అందరి ఎదుటా అలా మాట్లాడకూడదు,'' అని నచ్చచెప్పసాగింది.

దహన కార్యక్రమానికి మృత్యుంజరావుకూడా స్మశానందాకా పోయివచ్చాడు శవాన్ని తగలబెడుతూంటే అతని వళ్ళు జలదరించింది. "నన్నూ యిలాగే కాలుస్తారు. నా శవంచుట్టూ కనీసం కొంతమంది మనుషులు పోగవుతారు,' అనుకున్నాడు.

ముసలాయన మరునాడు ఉదయమే వచ్చి గదులు ఖాళీ చెయ్యమని గొడవ చేయసాగాడు. చూడబోతే కర్మకాండ వ్యవహారానికి అంతా ఆయనే ఆధ్వర్యం వహించేటట్లుగావుంది. ఎలాగా అని తటపటాయిస్తున్నాడు మృత్యుంజయరావు. ఇంతలోనే యీ విషయం దుఃఖంలోవున్న చిలకమ్మగారికి తెలిసింది. "వద్దు. పాపం అతన్ని ఖాళీ చేయమనకండి. లంకంతకొంప వుండగా ఆ కాస్తగదీ ఏ మద్దమొచ్చింది. కాకపోతే అతని అక్కగారు వచ్చినపుడు తీసుకున్న గది అతని కవసరంలేదు కాబట్టి తీసుకుందాం,'' అని కబురుచేసింది. ముసలాయన సరేసరే అని తల ఊపి మెల్లగా జారుకున్నాడు.

ఆ సాయంత్రం మృత్యుంజయరావుకు టెలిగ్రాం వచ్చింది. "అమ్మకి జబ్బుగా వుంది, బయల్దేరు." పినతండ్రి యిచ్చాడు.

తల్లిని తలుచుకోగానే అతనికళ్ళలో నీళ్లు తిరిగాయి. 'అమ్మకి జబ్బుగావుంది. అమ్మకూడా చచ్చిపోతుందేమో,' అనుకున్నాడు. తల్లిని చూడటానికి అతని హృదయం ఆరాటపడింది. విచిత్రమైన స్పర్శ వంటిని తాకినట్లయింది. కొన్నాళ్ళ పాటు ఆఫీసుకు సెలవుపెట్టి స్వగ్రామానికి బయల్దేరాడు వెళ్ళేముందు గదిలోని సామానంతా అలమారాల్లో సర్దుకుని, తాను వచ్చేవరకూ గదిని యధేచ్ఛగా వాడుకొమ్మని యింట్లో మసులుతూన్న బంధువుకి చెప్పి తాళంచెవి యిచ్చాడు.

*    *    *    *

ఏలేశ్వరంలో తను కొన్నాళ్లు గడిపిన ఆ యింటిలో ప్రవేశిస్తూంటే అతని కాళ్లు తడబడ్డాయి. పినతండ్రులు, పెదతండ్రులు, వారి భార్యలు, వారి పిల్లలు అతనివంక అనాసక్తంగా, వికృతంగా చూశారు. ఆ చూపుల్ని తప్పించుకుంటూ, వాళ్ళు అడిగే వ్యంగ్యంతోకూడిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ అతను తల్లి వుంటూన్న శిథిలగృహంలోకి ప్రవేశించాడు.

అక్కడి వాతావరణాన్నీ, పరిస్థితినీ చూసేసరికి అతని నేత్రాంచలాలలో నీళ్లు నిలిచాయి. పశువులపాక అయినా అంతకంటే శుభ్రంగా, అమరికగా వుంటుంది

# పెళ్లి ఖర్చులకు
# జీవిత భీమా
# తగినంత రక్షణ





అమ్మాయి పెళ్లివిషయం బెంగగా వుందా? ఇక బెంగపడవద్దు.
పెళ్లిఖర్చులకు తగినంత డబ్బును సమకూర్చుకోడానికి తేలికపద్ధతి ఇదిగో
యల్ఐసి ఫిక్స్‌డ్‌టరమ్ (మ్యారేజి) ఎండోమెంట్ పాలసీ, అన్ని
ప్రీమియమ్‌లు చెల్లించేందుకు ఒకవేళ మీరు లేకపోవడమే సంభవించినా.
పెళ్లినాటికి అవసరమైన డబ్బును తప్పక సమకూర్చగలదు.
ఉదాహరణ పరిశీలించండి. 30 ఏళ్ల వయస్సు కలిగిన యువకుడు
దాదాపు 3 ఏళ్ల కుమార్తెకు తగిన ఈడువచ్చేసరికి పెళ్లిఖర్చులకోసం
5000 రూపాయలదాకా సమకూర్చుకోవచ్చు. భీమాదారు నెలనెలా
రూ. 25.55ల చొప్పున క్రమం తప్పకుండా ప్రీమియం చెల్లించినా
(లేదా ఒకవేళ గడువుకు ముందుగానే భీమాదారు మరణించినా)
కుమార్తెకు 18 ఏళ్లు వచ్చేనాటికి ఈ సొమ్ము చెల్లించబడగలదు.
ఫిక్స్‌డ్‌టరమ్ (మ్యారేజి) ఎండోమెంట్ పాలసీగురించిన
పూర్తి వివరాలను నేడే యల్ఐసి ఏజెంట్‌ను అడిగి తెలుసుకోండి.

## జీవిత భీమాకు
## ప్రతిగా మరొకటిలేదు



ఎండకు అడ్డులేదు, వానకి అదుపులేదు, చలికి అవధిలేదు. ఆ బూజుతో జీరాడుతున్న కొంపలో, దుర్గంధ భూయిష్టమైవున్న ప్రదేశంలో, ఓ కుక్కి-మంచంమీద కృశాంగియై పడుకునివుంది శ్రీదేవి_అతని తల్లి.

"అమ్మా!" అని పిలిచాడు కలవరపాటును అణుచుకుంటూ.

జీవకళ నశించివున్న తనకళ్ళను గుమ్మంవైపు త్రిప్పింది ఆ ప్రాణి. ఓ ఆనందపు జీర వ్యాపించింది కనులలో.

"వచ్చావా?'' అంది. ఆ కంఠం ఏదో లోకాలనుంచి పలికినట్లయింది.

"వచ్చానమ్మా,'' అని ఆనందాతిరేకంతో గట్టిగా అరుద్దామనుకున్నాడు. కాని అంత ఆప్యాయత ప్రదర్శించటం ఆ అభాగ్యుడికి చేతకాలేదు. తల ఊపుతూ దగ్గరకు నడిచాడు.

"ఇలా దగ్గరకు రా బాబూ! ఇక్కడ కూర్చో.''

అతనామె చెంతకు వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. అతడామెను చూస్తున్నాడు. ఆమె అతన్ని చూస్తోంది. ఒకరికళ్ళలో ఒకరు లోకాలు చూసుకుంటున్నారు. కృశించిపోయివున్న ఆమె చెంపలమీదుగా కన్నీరు జాలువారుతోంది. ఒకనాటి సౌందర్యవతి శ్రీదేవి _ నేడు సర్వసౌందర్యం నశించి, జీవచ్ఛవంలా, అస్థిపంజరంలా మంచాన పడివుంది.

ఆమె తన పుడకల్లాంటి చేతులు, ఎంతో ప్రయత్నంమీద అతని వీపుచుట్టూ వేసి దగ్గరకు లాక్కుంది. తల్లిహృదయంమీద, ఆమెకు ఎక్కడ నొప్పి కలుగుతుందోనని తేలికగా ముఖం ఆన్చి, అతను వలవల ఏడ్చేస్తున్నాడు.

"ఏడవకు బాబూ! ఏడవకు. అలా నువ్వేడుస్తూంటే నా కడుపు తరుక్కుపోతోంది.'' ఆమె ఓ చెయ్యి యెత్తి అతనికళ్లు తుడవటానికి ప్రయత్నిస్తోంది.

"ఏడవను అమ్మా! నిజంగా ఏడవను," అతను దుఃఖాన్ని అపుకో ప్రయత్నిస్తున్నాడు, ''నేను మాహాపాపిని. తల్లిని యీ స్థితిలో వుంచి, అక్కడ ఏకాంతంగా బ్రతుకుతూన్న నా పాపానికి నిష్కృతిలేదు. నేనూ యిలాగే కుళ్ళికుళ్ళి చస్తాను,'' అని అతని అంతరంగం ఘూర్ణిల్లుతోంది.

''కులాసాగా వున్నావా బయా! నువ్వు కాలం ఎలా గడుపుతున్నావు?'' ఆమె మృదుకంఠం అతని చెవుల్లో ధ్వనించింది.

''నాకేమమ్మా! బాగానే వున్నాను?"

ఒకక్షణం విరామం. బయట, దూరంగా పిల్లలు అరుస్తున్నారు. పరిసరంలోనే ఎక్కడో కట్టివేసివున్న గేదె ఒకటి తెగ అరుస్తోంది.

''జగతి - జగతి కనిపించిందా ఎక్కడైనా ?''

ఉద్వేగా న్నాపుకోవటానికి అతను విశ్వప్రయత్నం చేయాల్సివచ్చింది. జగతిని తను కలుసుకున్నట్లూ, ఆమెతో కలసి కొన్నాళ్ళు నివసించినట్లూ తల్లికి సమస్తం నివేదించివేయా లనుకున్నాడు. కాని 'యింత జరిగినా ఆమెను నా దగ్గరకు తీసుకు రాలేకపోయావా'? అని ఆమె పుత్రికా శోకంతో తల్లడిల్లితే ? నిజం చెప్పటానికి సాహసించలేకపోయాడు. "ఉహు'' అని గొణిగాడు.

''దాన్నికూడా ఒకసారి కళ్ళారా చూడా లనుకున్నాను." ఆమె నిట్టూర్పు విడిచింది.

"అమ్మా !'' అన్నాడు మృత్యుంజయరావు ఆబగా. ''మనం కాకినాడ వెళ్ళి పోదాం రాకూడదూ ? అక్కడ ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి డాక్టర్లతో మంచి వైద్యం చేయిస్తాను ?"

"ఇంక నాకు డాక్టర్లెందుకు నాయనా ?" అంది క్షీణస్వరంతో తల్లి. "నా పని అయిపోయింది. అవసానదశలో వున్నాను. రోజులలో వుంది నా జీవితం."

"అలా అనవద్దమ్మా - అలా అనవద్దు. నువ్వు బ్రతుకుతావు. నిన్ను బ్రతికించు కుంటాను. మనం యివాళే వెళ్ళిపోదాం యిక్కడ్నుంచి. ఈ నరకకూపంలో యిహ వుండవద్దు." అంటూ ఆర్తనాదం చేశాడు.

ఆమె పెదవులపై శుష్కహాసం ఉదయించింది. ఆప్యాయతతో అతని తల నిమురుతోంది. "ఎందుకురా జయా ! వృధా ప్రయాస పడతావు ? ఇది పరమేశ్వ రుడి యిచ్ఛ ! అసలు యింతకాలం నాకు జీవితం కల్పించటంలో ఆయన సంకల్ప మేమిటో బోధపడకుండా వుంది. డాక్టరుకూడా వచ్చి చూశాడు. నాకు క్యాన్సర్ అని చెప్పాడు. ఇన్నాళ్ళకు భగవంతుడు తీసుకున్న నిర్ణయానికి తిరుగులేదు. నాకు పరమ సంతోషంగా వుంది ?"

అప్పు డామె ముఖంలోకి పరిశీలనగా చూశాడు మళ్ళీ. మృత్యుచిహ్నాలు స్పష్టంగా కనిపించాయి. లోలోన దుఃఖాన్ని దిగమ్రింగుకున్నాడు.

"నిన్ను చూస్తానో లేదో అనుకున్నాను. నా కోరిక నెరవేరింది. ఈ తృప్తి చాలు." ఆమె కళ్ళు మూసుకుంది.

ఎందుకు తనని చూడాలనుకుంది ? తనని చూస్తే తృప్తి ఎందుకు కలిగింది ? తన లాంటి అయోగ్యుడిని, అర్భకుడిని తనయుడిగా ప్రేమించి, తృప్తిపడటం ఆమె కెలా చేతనైంది ? తనలాంటివాడు తనకు కొడుకుగావుంటే, వాడిని చూసి తను భరించగలడా ? అతని మెదడు సతమత మవుతోంది.

"ప్రయాణ బడలికతో ఉండివుంటావు. స్నానం చేసి బట్టలు మార్చుకురా. ఈ నాలుగురోజులూ నన్ను విడిచి వుండకూడదు సుమా."

అతను స్నానాదులకై యింట్లో వున్నంతసేపూ యింట్లోని స్త్రీలూ, పురుషులూ కూడా చెట్టంత కొడుకు వుండి, తల్లిని తమపాలిట పడవేసి, బాధ్యత పట్టించుకోకుండా తిరుగుతున్నందుకు అతన్ని నిందిస్తూనేవున్నారు. ఆమెవల్ల తమకు ఎంత యిబ్బంది కలుగుతున్నదో, ఎన్నిపాట్లు పడుతున్నారో ఎకరువు పెడుతున్నారు. అతనన్నిటికి ఊఁ, ఆఁ అంటున్నాడు. వాళ్ళు పెట్టిన తిండి తిని ఆ ఊళ్ళో వున్న డాక్టర్ని కలుసుకొనటానికి పోయాడు.

ఆ డాక్టరు పేరు జగపతి. ఎమ్.బి బి.ఎస్. ప్యాసయి, ప్రభుత్వోద్యోగం చేయటం యిచ్చగించక, పట్టణాలలో వుండటానికి మనస్కరించక చాలా సంవత్సరాలుగా ఆ ఊళ్ళోనే వుంటూ ప్రాక్టీసు చేస్తున్నాడు. చుట్టుప్రక్కల పది పదిహేను ఊళ్ళనుంచికూడా ప్రజ ఆయన దగ్గరకే మందు తీసుకొనటానికి వస్తారు. చాలా దయార్ద్రహృదయుడు. డబ్బుగురించి ఎన్నడూ పట్టుబట్టడు. మృత్యుంజయరావు చెప్పింది విని "మీ అమ్మగార్ని నేను పరీక్ష చేశానండీ. మీ తండ్రిగారైన దీక్షితులు గారికీ నాకూ బాగా స్నేహం. ఆయనలాంటి ఆదర్శమూర్తి అంత త్వరగా పరమ

అతను ఫ్యాక్టరీలో అసిస్టెంటు ఫోర్‌మన్‌గా వుంటున్నాడు. లాబొరేటరి అసిస్టెంటుగా మొదలయిన అతని జీవితం ఏడేళ్లలో ఈ స్థాయికి చేరుకోగలిగింది. అతను ఏమంటాడో విందాం. "నేను సాధించిందేమీ గొప్పకాదు. పరిశ్రమతో ఎవరయినా ఈ మాత్రం సాధించగలరు. తప్పితే కొంచెం బాధ్యతాయుతంగా ప్రవర్తించాను. ఎక్కువ మంది పిల్లలుగల నా సహచరుల బాధలు చూశాను. నాకు ఇద్దరు పిల్లలే చాలనుకున్నాను. వాళ్లిద్దరి బాగా వృద్ధిలో తీసుకురావాలని న ఆశ. నేనెంతో ఆనదంగా వున్నాను."



## అతను ఆనందంగా వున్నాడు—

## మరి మీరు?



పడించటం, ఆయన కుటుంబానికి ఎనలేని కష్టాలు రావటం చాలా దురదృష్టకరం. ఒకరకంగా జీవితాన్ని సలక్షణంగా సరిదిద్దుకోవటానికి ఆయన నాకు ఒక యిన్స్పిరేషన్ కూడా," అని కొంచం ఆగి, "మీ అమ్మగారికి అన్ని యిన్వెస్టిగేషన్సూ చేశాను. అది కేన్సర్ స్టమక్. సెకండరీస్ అన్ని ఆర్గన్స్‌లో ఫారమ్ అయిపోయాయి. అంటే వ్యాధి బాగా ముదిరిపోయింది. క్షమించండి, నిజం చెబుతూన్నందుకు. ఆమెకు యిహ ఏ ట్రీట్‌మెంటూ పనిచెయ్యదు," అన్నాడు విచారస్వరంతో

"ఆపరేషన్ చేస్తేకూడానా ?"

"శరీరంలో చాలా భాగాలు కేన్సర్‌తో నిండిపోయాయి. అదిగాక కాలు కదల్చటానికి ఆవిడకు శక్తిలేదు. ఈ స్టేజిలో అసలు ఆపరేషన్ అనే ప్రశ్నలేదు. ఆమె యిహ కొన్ని రోజులకంటే జీవించదని చెప్పటానికి చింతిస్తున్నాను మృత్యుంజయరావుగారూ!"

అతను ఉస్సురని నిటూర్చి, డాక్టరుగారిదగ్గర సెలవుతీసుకుని, యింటిదారిపట్టాడు.

తర్వాత అతను తల్లికి చేసిన శుశ్రూషలు భూమ్మీద చాలా కొద్దిమంది చేయ
గలిగినవి. అందులో అతనికి ఎంతో ఆనందం, తృప్తి, మనశ్శాంతి కనిపించాయి.
తన స్వంత బలహీనతలనూ, విచారాలనూ ఆ కొసినిరోజులూ మరిచిపోయాడు.
పుట్టిన యిన్నాళ్ళకు 'నేను చేస్తున్న మంచిపని యిదే' అని అతనికి పదేపదే
స్ఫురించేది. తల్లీకొడుకులు ఏవేవో విషయాలు మాట్లాడుకునేవారు. నిమిషనిమిషా
నికీ వారిమైత్రి ప్రబలిపోయింది. వారి బాంధవ్యం పెరిగిపోయింది. ఒకరికొకరు
పెనవేసుకుపోయారు. మృత్యుంజయరావు ఆమెనోట్లో ఆహారం కలిపిపెట్టాడు.
తల హృదయానికి అన్చుకుని మంచినీళ్ళు త్రాగించాడు. ఆమె వాంతి చేసుకుంటే
తుడిచాడు. ఆమె బట్టల్ని తనే మార్చాడు. తనే వుతికాడు. సమస్తం చేశాడు.

రోజురోజుకూ ఆమె పరిస్థితి పూర్తిగా క్షీణించిపోయింది. తరుచు స్మృతి
తప్పిపోతోంది. ఒకసారి కళ్ళు తెరిచి చెల్లెలు భానుమతిని చూడాలని కోరింది.
వారు ఒకరినొకరు చూసుకుని పదిహేను సంవత్సరాలు గడిచివుంటుంది. మృత్యుం
జయరావు ఆమెను వెంటనే బయల్దేరి రమ్మని వైర్ యిచ్చాడు. రెండురోజులు
గడవకుండానే భానుమతి, భర్తతోసహా తరలివచ్చింది. పిల్లల్ని తీసుకురాలేదు.
అక్కను కౌగలించుకుని ఏడ్చింది. శ్రీదేవి కళ్ళు తిప్పి చూసింది. చెల్లెల్ని గుర్తు



# శుభస్య శీఘ్రం

శుభాకాంక్షలను తెలిపే మీ తంతిని మీరు ఒక నెల ముందుగా కూడా 'బుక్' చేసుకోవచ్చు; మీరు నిర్దేశించిన తారీఖునాడే అది అందజేయబడుతుంది చివరి క్షణంలో తొందరపాటు. తంతి సకాలానికి అందకపోవటము అనే సమస్యలు లేకుండా చూసుకోండి

*మీరు పంపే శుభాకాంక్షలను, అంకెలు వేయబడిన శుభాకాంక్షలనుండి ఎన్నుకోండి. దీని మూలంగా మీకు ఖర్చు తగ్గుతుంది రంగు రంగుల డిజైన్లు గల ప్రత్యేకమైన కాగితాలపై ఈ శుభాకాంక్షలు ఉదయం 8 గంటలనుండి రాత్రి 9 గంటల మధ్య మీరు కోరిన వ్యక్తికి అందజేయబడుతాయి*

భారత తంతి, తపాలా శాఖ

davp 67/410

పట్టింది. కాని అప్పటికి మాటకూడా పడిపోయింది. ఆమె కంటివెంట నీరు కారింది. ఏదో సౌంజ్ఞ చేయటానికి ప్రయత్నించింది. కాని మళ్ళీ స్మృతి తప్పిపోయింది.

సరిగ్గా మృత్యుంజయరావు ఆ ఊరు చేరిన పదిహేను రోజులకు అతనితల్లి, తన బాధలకు, తన శోకజీవితానికి, తన నరకయాతనలకు, తను అనుభవించిన హింసలకు స్వస్తిచెప్పి వెళ్ళిపోయింది. ఆమెప్రాణం అనంతవాయువులో కలసిపోయింది.

ఊరినుంచి తిరిగివచ్చి మృత్యుంజయరావు తన యథాజీవితం ప్రారంభించాడు. అతనికి అక్కడి పరిస్థితుల్లో అనేక మార్పులు కనిపించాయి. ఇంటావిడ చిలకమ్మగారు మొదట మొదట అతను కనిపించగానే లోపలికి వెళ్ళిపోతూండేది. రాను రానూ బయటకు రావటం మొదలుపెట్టింది. వీధిలోకి పెత్తనాలుకూడా సాగించింది. తన తమ్ముడ్నీ, మరదలు దేవమ్మనీ, తండ్రినీ తెచ్చి యింట్లోనే పెట్టుకున్నది. పిచ్చివాడూ, ముసలాడూ బయట వసారాలో పడుకునేవారు. చిలకమ్మగారూ, మరదలూ, పిల్లాడూ తలుపులు వేసుకుని లోపల పడుకునేవారు మొదట యింటావిడ గొంతు బయటకు వినిపించేది కాదు. వినిపించినా అది చచ్చి స్వర్గంలోవున్న భర్తను గురించిన ప్రశంసతోకూడిన ప్రసంగమై వుండేది. రాను రానూ ఆవిడ కంఠం స్థాయి పెరగసాగింది. వదినా మరదళ్ళు ఒకరికెదురుగుండా ఒకరు కూర్చుని పరిహాసాలు, వినోద ప్రసంగాలు, నవ్వులు, కేరింతలు, లేకపోతే దాసీ

దానితో ఇరుగుపొరుగుల గురించి బాతాఖానీ. ఇహ వాళ్ళ జీవితంలో ముఖ్యాంగం 'తిండి'యై కూర్చుంది. ఎప్పుడూ చిరుతిళ్ళు చేసుకుని మ్రింగడమే. చేగోడీలు, జంతికలు, కజ్జికాయలు, మినపసున్ని, పెసరట్లు, ఉప్మాలు, ఒకటేమిటి సమస్తం చేసుకోవటం మెలకువగా వున్నంతసేపు తినటం. ఇంటావిడ రోజురోజుకూ లావవటం మొదలుపెట్టింది. చీటికీ, మాటికీ వగర్పు, ఆయాసం, కాళ్ళనొప్పులు మొదలయ్యాయి. డాక్టరు దగ్గరకు వెళ్ళి వచ్చింది. 'డయాబిటీస్' అని తిండి తగ్గించమన్నాడుట. ఆవిడ బెంగపెట్టుకుని కష్టంమీద కోరికలు దిగమ్రింగుకుంటోంది. ఆవిడకి కాశ్మీరం చూడాలని ఎన్నాళ్ళబట్టో కాంక్షయట. మేనల్లుడ్ని తీసుకుని విమానంలో కాశ్మీరుయాత్ర చేసిరావాలని ఊపాయాలు పన్నుతోంది.

మాలతి ప్రవర్తనలోకూడా చిత్రమైన మార్పు కనిపించింది మృత్యుంజయరావుకు. మునపటిలా తనతో అంత చనువుగా మాట్లాడటంలేదు. తనంటే ఒకప్పుడు ఆసక్తి వుందనీ, అది యిప్పుడు తగ్గిందనీ అతను నమ్మటంలేదుగాని ఆమె మనసులో ఏదో మథనతో వుంటూందనీ, పరధ్యానంతో వుంటూందనీ గ్రహించాడు. రెండుమూడుసార్లు యింటికి వెళ్ళినా మనసువిప్పి మాట్లాడలేకపోయింది. ఒకసారి ఆమె యింట్లో శేఖరం కనిపించాడు. ఇద్దరూ నవ్వుకుంటూ మాట్లాడుకుంటు

---


## FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | YUVA Office, 5-9-88 Public Garden Road, Hyderabad-1 |
| 2. Periodicity of its Publication | : | MONTHLY |
| 3. Printer's Name | : | SRI A. SUDHAKARA RAO |
| Nationality | : | INDIAN |
| Address | : | 5-9-88, Public Garden Road, Hyd-1. |
| 4. Publisher's Name | : | SRI A. SUDHAKARA RAO |
| Nationality | : | INDIAN |
| Address | : | 5-9-88, Public Garden Road, Hyd-1. |
| 5. Editor's Name | : | SRI CHAKRAPANI (Alias Sri A. V. SUBBA RAO) |
| Nationality | : | INDIAN |
| Address | : | 5-9-88, P. G. Road, Hyd . |
| 6. OWNERS | : | M/s. YUVA Concerns, Hyderabad. |

| Partners: | Resi. Addresses: |
|---|---|
| Sri A. V. Subba Rao (Chakrapani)<br>Sri A. Chandrashekhara Rao-Minor<br>Sri Rajashekhara Rao -Minor | 2 & 3 Arcot Road<br>Madras-26. |
| Sri A. Sudhakara Rao | 5-9-88, Public Garden Road,<br>Hyderabad-1. |

I, A. Sudhakara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Hyderabad-1.
Date: 1-3-1968

A. SUDHAKARA RAO
Signature of Publisher

న్నారు. ఆఫీసులోకూడా యిద్దరూ తరుచు కలుసుకుని గంటలతరబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. అతనితో మాట్లాడుతూన్నప్పుడు ఆమెముఖంలో వెలుగొందుతున్న కాంతీ, ప్రదర్శిత మవుతూన్న ఉత్సాహం, పెదవులమీదీ, కనులలోనీ చిరునవ్వూ మృత్యుంజయరావు చూపులు తప్పించుకోలేక పోయాయి.

దానికితోడు సంజీవరావు, వైకుంఠం, తురంగరావూ మొదలైనవాళ్ళంతా అతన్ని ఆటపట్టించటం సాగించారు.

"మాలతిగాలి మళ్ళిందేమోయి" అని ఒకడూ.

"నిన్న మృత్యుంజయరావూ, నేడు శేఖరం, రేపు ఎవరి వంతో?" అని యింకొకరూ.

"మొత్తంమీద శేఖరం మృత్యుంజయరావు మీద దెబ్బతీశాడు'' అని మరొకడూ వేళాకోళం పట్టిస్తున్నారు. ఇదివరకు యితన్నిగురించి ఎలా గుసగుస లాడుకునే వారో యిప్పుడు శేఖరం, మాలతులగురించి అంత ఉధృతంగానూ చర్చలు సాగిస్తున్నారు.

తల్లి మరణించిన దాదిగా అవరించిన విరక్తినుండి అతనింకా కోలుకోలేదు. వీటన్నిటినీ ప్రాపంచిక విషయాలుగా త్రోసిపుచ్చి ఎంత పట్టించుకోకూడదన్నా లోపలనుండి ఉబికి వస్తూన్న నైజం గుణం అతన్ని చిత్రవధకు గురిచేయకుండా వుండలేక పోయింది.

తనకి మాలతిమీద ఆశవుండదా! ఉండవచ్చు. కాని అది దురాశఅనీ, నెరవేరదనీ తెలుసు. కాని ఒకప్పుడు మాలతివద్ద అతని అంతస్తు చాలా ఉన్నతంగా వుండేది. శేఖరంకూడా అసూయపడేటంతటి దశలో వుండేవాడు. ఇప్పుడాస్థితి తారుమారైపోయింది. శేఖరం తనని ఓడించి చిత్తు చేశాడు. ఆనాడు మంజులతవద్ద శేఖరం వల్ల పరాభవానికి గురిఅయాడు. ఇప్పుడిది రెండో పరాభవం. శేఖరం కనిపిస్తే ముఖమెత్తి చూడలేకపోతున్నాడు. చాటు చాటుకు త్రిప్పుకుంటున్నాడు, "నేను వీటన్నిటికి అతీతంగావుంటాను. నన్ను నేను పరిశుద్ధంగా నిర్మించుకుంటున్నాను. ఎవరెట్లాపోయినా నా కనవసరం" అని ప్రతిక్షణం అనుకుంటున్నాడు. కాని అంతలోనే అది గాలిలో దూదిపింజలా ఎగిరిపోతుంది. అతని గుండెల్లోమంట. అసూయాజ్వాలలు ఎగచిమ్ముతాయి. వెంట వెంటనే చచ్చిపోయి మరోజన్మ — అందగా, ప్రకాశవంతుడిగా, గొప్పవాడిగాపుట్టి అందర్నీ చక చక ఓడించాలని వుండేది. కాని అప్పుడతను పాత మృత్యుంజయరావుగా ఎక్కడో ఓ మారుమూల నిల్చుండి ప్రతి సన్నివేశం అవలోకిస్తూ వుండాలి. తనకు అన్నీవుండాలి. అన్నీ తెలియాలి. తను సర్వజ్ఞుడుకావాలి. (సశేషం)

Printed and published by A. Sudhakara Rao for Yuva Concerns and printed at Yuva Press, Public Garden Road – Hyderabad - I. Phone 36336

YUVA March '68 One Rupee Regd. No. H 131